# పద్మావతి

'రండిబాబూ మాధవరావుగారూ !'

'శాయివేణీ, నీలవేణి యెక్కడా ?'

'యింట్లోనేవుంది బాబూ'

'మరదలుగారూ!' అంటూ లోపలకు వెళ్ళాడు మాధవరావు.

'యేమండీ బావగారూ?' అంటూ పవిట సర్దుకుంటూ గదిలోనించి చంగ్, చంగ్ మని చిందులు తొక్కుతూవచ్చింది మాధవరావుకి యెదురుగా లేడిపిల్లలాగా నీలవేణి.

'నీలవేణి పడుకున్నావా యేమిటి ?'

'అబ్బే లేదండీ గదిలోకూర్చుని నవల చదువుకుంటున్నాను'

'మీా అప్ప యేదీ ?'

'అదుగో'

'రాత్రి మీారు చప్పునే వచ్చారండీ.' అంది మోహిని గదిలోంచి సావిట్లోకివచ్చి పవిట సవరించుకుంటూ.

'యేం చెయ్యమన్నావే. యిక్కడినుంచి చీకటిపడి యింటికి వెళ్ళానా, యింటికి వెళ్ళేటప్పటికి మా మణికి జ్వరం తగిలింది చప్పున భోంచేసి వద్దామనుకుంటే వాడు నాన్నా, నాన్నా అంటూ నన్ను ఒదిలాడుకాడు. పైగా నాకుకూడా తల

నొప్పిగావుంది. సరే రేపు పోవచ్చునులే అని యింట్లోనే వుండి పోయాను.'

'యింకా వస్తారు, యింకా వస్తారు అని మీకోసంచూసీ చూసీ విసిగెత్తిపోయింది.' అంది మోహిని.

'యెంతగా నమ్మించారండీ బావగారూ.' అంది నీలవేణి పకాలున నవ్వుతూ.

'అవునుగాని అలంకారం అదీ బాగానే చేసుకున్నావుగాని తల్లో పూవులు మరిచిపోయావా?'

'మీరు తెచ్చిపెడతారుగదా అని వూరుకున్నాను.'

'అయితే యిదుగో పెడతాపట్టు' అన్నాడు పక్క జేబులోంచి మల్లెపూల చెండుతీసి.

'మీరేం పెట్టక్కర్లేదు నా కియ్యండి నేను పెట్టుకుంటాను' అంది చెయ్యి చాపుతూ నీలవేణి.

'అలా కాదు. వుండవోయ్ నేను పెడతాను యిలారా' అంటూ నీలవేణి జెడలో మల్లెపూలచెండు పెట్టాడు.

'యేదీ యిటుచూడు నీలవేణీ! యిప్పుడు వచ్చింది మొఖానికి కళ యెన్నాళ్ళయిందో నిన్ను ముద్దుపెట్టుకొని......'

'సరేలే దూరంగా నుంచోబాబూ!' అంటూ గబగబా లోపలికి వెళ్ళిపోయి తల్లిదగ్గర జేరింది నీలవేణి.

'మీ అమ్మదగ్గర జేరితే నాకేం భయం అనుకున్నావా? నేను రాలేననుకున్నావా?'

'రోజూ పెట్టుకునే ముద్దులు చాలవా?'

'అదంతా నీ కెందుకోయ్'

'చూడవప్పా! బావగారు'

పనం తలుచుకుంటే అప్ప యేంచేస్తుంది, అమ్మ యేం
నీలవేణీ!'

ఇదుగో మా అప్ప వెళ్ళండి.'

ఇదంతా తరువాతమాట. నువ్వు నాకందవా యివాళ?'

అబ్బ! చూడమ్మా.'

యీ అవస్త అంతా యెందుకు ఒక్కసారి అటు వెళ్ళ ఆయన నిన్ను ఒదిలిపెడితారా? ఆయనకు అందకుండా ండగలవా?' బావ కనక సరసాలాడతారు పరాయి కో యింత యిదిగా సరసాలాడతారా?'

ముసలిదానివిఅయితే అయావుగాని బాగా చెప్పావ్ !'

హా(......బాగా చెప్పావ్ శాయివేణీ!' అంటూ వ్వును యెక్కిరించింది నీలవేణిచేతులు త్రిప్పుకుంటూ.

అమ్మ వెనకాలనుంచుని మాట్లాడటంకాదు యివతలకి ట్రావు, అప్పుడూ మనయిద్దరపని!'

అబ్బ! చూడవే అప్పా!, అంటూ చిన్నపిల్లలాగా చిం క్కుతోంది, వెనకాల నుంచుని.

మేం చెయ్యాలంటావేనన్ను?'

లుచుకు వెళ్లు బాబూ.'

యివాళదానిమీద పట్టించావేమిటి యిలా రండి మీరు' హించి మాధవరావుచెయ్యి పట్టుకుని.

ఉండవే నేవస్తా నువ్వుపద. యివాళదానిపంతం నెగ్గు నాపంతం నెగ్గుతుందో చూడాలి. రావాలి.' అని చెయ్యినిదిలించేశాడు మాధవరావు.

'యివాళేమన్నా ఒక బుడ్డి బిగించి వచ్చావేమిటి?'

'మరీ......'

'లేకపోతే యింత జోరుగావుండవులే.'

'యిదేం జోరూ నువ్వుయివతలకురా మరి.'

'వస్తారమ్మని త్రిమ్మన్న బాతికి. అదుగో అప్పపిలుస్తోంది అటుచూడు.' అంటూ గదిలోకివెళ్లి తలుపు బిగించుకుందామని చప్పున గదివైపుకు పరిగెత్తింది. గభాలున వాలుజెడ లంగించుకున్నాడు మాధవరావు. వాలుజెడ పట్టుకుని లాగటంలో జెడలోని మల్లెపూలచెండు క్రిందపడిపోయింది.

'అదుగో పూలచెండు క్రిందపడింది తల్లోపెట్టుకోనీ.'

'నేనున్నాగా నీకెందుకు ఆశ్రమ. నీలవేణి.' అంటూ త్రాచుపాములాంటి పొడుగైన వాలుజెడ ఒక చేత్తోపట్టుకొని రెండో చేత్తో క్రిందపడిన పూలచెండును తీసి వాల్జెడలో పెట్టాడు. అప్పటికీ తప్పించుకుని పారిపోదామని చూస్తోంది నీలవేణి. కాని వీలుకావటంలేదు. వాల్జెడ ఒదిలి చెయ్యిగట్టిగా పట్టుకున్నాడు మాధవరావు.

'యిప్పుడెక్కడికి పోతావ్ నీలవేణి?'

'అబ్బ! గాజులుపగుల్తాయి ఒదులు బావా.'

'పాతవి పగిలితే క్రొత్తవి వస్తాయి యేం!'

'పోన్లేనన్ను ఒదులు మా అప్పనీకోసం చూస్తోందివెళ్లు'

'యిప్పుడు చిక్కావాలేదా? నాచేతులో......'

'చిక్కాలే ఒదుల్దూ' అంది తలవంచుకొని ముఖానికి మోచెయ్యి అడ్డంపెట్టుకుని

'తలయెత్తిచెప్పూ. నావంకచూస్తూ తలయెత్తితే ఒది లేస్తాను లేకపోతే యెంతసేపున్నా నువ్వు అంతే నేనుయింతే. నా చేతులోంచి ఒదిలించుకుని పోలేవు.'

'ఒదులుబాబూ! యెక్కడైనా దొరికితే చిల్లికానీ యిస్తానునీకు.' అంది తలయెత్తి చూచి. గభాలున నీలవేణిని గోడకు నొక్కిపట్టి కసితీరా ముద్దుపెట్టుకున్నాడు.

'లే......పాడూ......!' అంటూ బుగ్గతుడుచుకుంది పైటతో నీలవేణి.

'యింకొక్కటే......ఆబుగ్గ......ఆబుగ్గ......!' అంటూ నీలవేణి వంచిన తలను బలవంతాన పైకియెత్తి రెండో బుగ్గ కందేటట్లు ముద్దుపెట్టుకున్నాడు, నొక్కిపట్టి. ఆసందడిలో జేబూలోవున్న పదిరూపాయిలనోటును కొట్టేశింది నీలవేణి. ఆసంగతి తెలుసుకోకుండా నా పంతంనెరవేరించి కదా అని ఒదిలిపెట్టేశాడు.

'అబ్బ! చంపేశారండీ బావగారూ!'

'యింకాఅంతమట్టుకు అదృష్టవంతురాలివి.'

'వుక్కిరిబిక్కిరిచేశారు వూపిరాడకుండా!'

'ఆఁ...యిదొకలెఖ్ఖా నీకూ?'

'అమ్మా! యీపదిరూపాయిలనోటూ దాయవే!' అని గభాలున తల్లిచేతికి యిచ్చింది నీలవేణి. చప్పున తీసుకుని కొంగునకట్టుకుంది శాయివేణి కూతురుసంపాదనకు సంతోషిస్తూ.

'మొత్తంమీద జాతిబుద్ధి పోనిచ్చావుకాదు.' అన్నాడు మాధవరావు యేంచెయ్యలేక తెల్లబోయిచూస్తూ.

‘లేకపోతే తేరగావున్నాయా ముద్దులు.’ అంది తలకాయ ఎగరేస్తూ నీల వేణి.

‘అంతేలేవే మీ బ్రతుకంతా! లంచం యిస్తే మంచాలెక్కే రకం అని నాకు తెలియదూ?’ అన్నాడు కాస్త రోషంగా.

‘మాటమాటకీ ముద్దు! ముద్దు! అని బుగ్గలుకొరుకుతూ వుంటావే!......అప్పా! పదిరూపాయలు యిచ్చాడే బావనాకు.’ అంది మోహినితో.

‘ముద్దుపెట్టుకుంటే యేమే, బుగ్గలు అరిగిపోయాయా? తరిగిపోయాయా?’ అంది పదిరూపాయిలు చేతులో పడ్డాయనే సంతోషంతో శాయివేణి.

‘పది రూపాయలు కొట్టేశావ్ మీబావదగ్గర నువ్వే తెలివిగలదానివంటే.’ అంది మోహిని.

‘అప్పా! యివాళ బావ త్రాగివచ్చాడే! దగ్గిరకు వస్తేతగని కంపేస్తోందిబాబూ.’

‘యేమండీ యివాళ యేవన్నా పుచ్చుకున్నారా యేమిటి?’

‘ఒక స్నేహితుడు కనపడి రారా బ్రదర్ అంటే స్వల్పం పుచ్చుకున్నాను. యింకాకాస్త యియ్యి మోహిని.’

‘నిన్నటి బుడ్డీ ఖాళీ అయిపోయింది క్రొత్తబుడ్డి తియ్యాలిల్సిందే తియ్యమన్నారా?’

‘ఊఁ తియ్యి. యెన్నిబుడ్లుకావాల్నంటే అన్నిబుడ్లు తెప్పిస్తాను మనకి త్రాగుడుకేం తక్కువ మోహినీ! యేమంటావ్ నీలవేణీ?’

‘అవును బావా! సారాలోనేవుంది స్వర్గం!’

‘బలే......బలే రవ్వలాంటి మాటచెప్పావ్ నీలవేణి.’

'మాధవరావుబాబూ! నన్ను మరిచిపోకండి సినిమాతీసేటట్లయితే.'

'మోహినీ! మీముసల్దానికిట కొంచంయివ్వు గ్లాసులో పోసి, నీలవేణీ మావంతు అయింది నువ్వుకూడా– బిగించు...... జల్సాచెయ్యి ...' మోహినీ, నీలవేణీ, శాయివేణీ, మాధవరావూ, యిష్టమువచ్చినట్లుగా తాగారు.

'మోహినీ! ఒక్కపాటపాడు జల్సాగా...'

'జావళీలు తప్ప నాకేంరావండీ. మీకు తెలుసుగా'

'తెలుసనే పాడమంటున్నా ...... యేంటీ ...... కమ్మగా ఒక్కజావళీ కానీ... మనిషివూగిపోయేటట్లుగా పాడాలి' అన్నాడు తాను వూగులాడుతూ, మోహిని, 'రారా! నా ప్రియుడా! రారా! నాసరసుడా! రారా!' అంటూ జావళీ మొదలుపెట్టింది. అప్పపాటలో కలిపి పాడుతూ మాధవరావు యెదురుగా మోకాళ్ళమీద కూర్చుని అభినయం పట్టటం మొదలుపెట్టింది నీలవేణి. సారాతాగిందానిమీదట ఒళ్ళు తెలియక మోహినినిచూచి నీలవేణి అభినయంచూచి మురిసిపోతూ తాళంవేస్తూ వూగులాడుతున్నాడు మాధవరావు సిగరెట్టుతాగుతూ పొగపోగ్గా మోహిని మీదకి వూదుతూ మయిమరచిపోతున్నాడు.

# 2

'భద్రావతి వదినా! ఎంతకాలం యింకానీకు యీఅవస్థ?'

'అనసూయా! అమాటమనంచెప్పలేం. నాకు మంచి రోజులు రావాలి. ఆయన బుద్ధిమారాలి.'

'వదినా! నీకు వకమాటచెప్తాను కోపంరాదుకదా!'

'అనసూయా! యింతకాలంనుంచి మనం యిరుగుపొరుగు వాళ్ళమైనా, అక్కాచెల్లెళ్ళలాగా వుంటున్నాము కదా! నీమాటకు నాకు యెప్పుడైనా కోపంవుందా??'

'అన్నయ్యను కట్టుదిట్టంలో పెట్టరాదూ నువ్వు?'

'మగవారిని మనం కట్టుదిట్టంలో పెట్టగలమా అనసూయా?'

'యెందుకు పెట్టకూడదూ. నయానో, భయానో చెయ్యొచ్చు ఆపని ప్రయత్నం మీద.'

'మీ అన్నయ్య ప్రపంచసమాజం మనిషికాదు అనసూయా! ప్రపంచ సమాజంగా భార్యాలకు దాసోహం అనే భర్తలు వుంటే యెంతకట్టుదిట్టంలో అన్నా వుంచవచ్చును. యెంతనాటకమన్నా ఆడవచ్చును.'

'మాఅన్నయ్య మొదటినుంచీ యింతేనా వదినా?'

'మొదటినుంచీ లేంది మధ్యలో యెలావస్తుందిగాని అయితే యింతవచ్చి అన్యాయంలేదు అనసూయా!'

'నువ్వు కాపరానికి వచ్చేటప్పటికి కూడా అన్నయ్య సరిగా యింటికి రాకపోవటం, తాగుడు యీ అలవాట్లు వున్నాయా! ... వదినా?'

'నాకు పదిహేనో సంవత్సరములో పెళ్ళయింది అన సూయా! పదిహేడో సంవత్సరములో కార్యమయింది. కార్య మయిననాల్గు, అయిదునెలలకు కాపరానికి వచ్చాను. నేను కాపరానికి వచ్చినరోజులలో బైటగొడవలు యేంవున్నాయో, యేంలేవో నాకు తెలియదుగాని, నన్నుమటుకు బాగానేచూసే వారు. తరువాత, తరువాత క్రమక్రమంగా యింటికి రావటం మానెయ్యటం, యీ తాగ్రుడూ, జువ్వ ...... మొదలయిన వాటిల్లో దిగారు......'

'అయితే యిప్పుడు మణికి యెన్నోయేడంటావ్?'

'మణికి యిప్పుడు నాలుగోసంవత్సరంగడుస్తోంది'

'అబ్బాయిమీదన్నా ప్రేమలేదేం అన్నయ్యకు?'

'మణి యేడాదివాడై వుండగా యెప్పుడూ చంకనెత్తుకుని కూర్చోమంటుండేవారు. వాడిని యేడవనైనా యేడవనిచ్చే వారుకాదు. వాడు తొట్టెలోపడుకుని 'కేర్' మంటేచాలు యెందుకే వాడిని అలా యేడిపిస్తావంటూ నన్ను యెంతో కేక లేసేవారు. వాణ్ణిచూడకుండా వక్కనిమిషం వుండేవారుకాదు. అటువంటి ప్రేమ అంతా యెక్కడికి పోయిందో, ఆ ఆదరణ అంతా యేమయిందో, నాన్నా, అని వాడంతటవాడు దగ్గరకు వెళితే తప్ప లేకపోతే యింటికివస్తారా, వాడిసంగతే తలచరు. రావటం పూటకూళ్ళయిల్లులాగా భోంచెయ్యటం వెళ్ళిపోవటం. ఒకపలుకూ మంచీ చెడ్డా యేమీలేదు. రాత్రిపూట ఆయనదయ వుంటే, యే అర్థరాత్రికో వస్తూవుండేవారు యిప్పుడు అది కూడా తగ్గించేశారు. ఒకవేళయింటికి చెదురువాటుగా వస్తేగే అనుకో సంగతి చెపుతున్నా నాన్నా అంటూ వాడుదగ్గరకు

వెళితే తప్ప లేకపోతే వాడిని కన్నెత్తి అయినాచూడరు. వాడి మాటే తలచరు. యింటికి వస్తే ముళ్ళమీద నుంచున్నట్లుగా నుంచుంటారు. ఆయనకేమిటోగాని యిల్లొక యమలోకంగా వుంటుంది. మాట మాట్లాడితే నోటివెంట ముత్యాలు రాలి పోతాయేమో అన్నట్లుగా మాట్లాడుతారు...'

'అన్నయ్యేకాదు వదినా! వేశ్యలను మరగిన వారందరూ అంతేఅనుకో. వాళ్ళకియిళ్ళు వాకిళ్ళతో పనేంలేదు. ఆవేశ్యలే-రంభలూ, ఆవేశ్యల యిండ్లే స్వర్గలోకంగా వుంటుంది, అటువంటి వ్యసనాలకి అలవాటు పడ్డవాళ్ళ మనస్సు నిలకడగా వుండదు వదినా! చంచలంగా వుంటుంది. నువ్వు పూర్వకాలంమనిషివి గనుక యింకాయిటువంటి మొగుడితో కష్టమోసుఖమో గుంభనగా కాలంగడుపుతున్నావు. నేనయితేనా నీకాపరానికి నీకూ ఒక దణ్ణంబాబూ అని యీపాటికి లేచిపోయేదాన్ని...'

'యెక్కడికిపోతాం అనసూయా?'

'నువ్వనరిగా బుద్ధికుదిరి యేలుకుంటానన్నప్పుడే వస్తానని పుట్టింటికి వెళ్ళిపోయేదాన్ని - లేకపోతే యీయమబాధ యెవరు పడగలరు? సహనంగలదానివి గనుక యింతకాలం భరించావు గాని నేనయితే యీవిధంగా తిరిగి మొగుడితో ఒక నిమిషం కాపరంచెయ్యలేను బాబూ! లోకం యేమనుకున్నాసరే తర వాత మాట యేదియెట్లావున్నాసరే ముందు యీనరక కూపం లోంచి బైటపడేదాన్ని, వదినా! నువ్వహాయిగా పుట్టింటికి వెళ్ళిపోరాదూ పిల్లాణ్ణితీసుకుని అప్పుడు తలతిరిగి అన్నయ్యే తోవకివస్తాడు.'

'మాఅన్నయ్య యెప్పుడూ అంటూనే వుంటాడు. మా యింటికివచ్చి వుండండీ నువ్వూవమణి అని. వాడికి బాగా తెలుసు మీఅన్నయ్యప్రవర్తన అంతా. యెప్పటికప్పుడు యింకెన్నాళ్ళు పడగలం యీకష్టం లేచిరమ్మంటూ వుంటాడు. యెంత తోబుట్టిన వాడయినా వాడింట్లోమటుకు యెన్నాళ్ళుంటాం?! నాలుగు రోజులు వుంటాము. పదిరోజులు వుంటాం యెల్లకాలం విధాయకం అయింది యిక్కడయ్యే! విధాయకం అయినచోట వుండాలిగాని, విధాయకంగాని పుట్టింటిదగ్గర పడివుంటేమటుకు యేం పరువు?! భర్త సరిగా చూసినా చూడకపోయినా, కొట్టినా, తిట్టినా, చంపినా, ఆడదానికి భర్త కాళ్ళదగ్గర పడివుండుటయే పరువు అని నా అభిప్రాయం అనసూయా! దగ్గరవుండి మంచి తనంమీద భర్తను మంచిమార్గంలో పెట్టుకోవచ్చునుగాని, పుట్టింటిదగ్గర కూర్చుని భర్తను సాధించటం అంటే అది సాధ్యమైనపనికాదు అనసూయా.'

'వదినా! నీమంచితనం వల్ల అన్నయ్యను యేమాత్రం మంచిమార్గంలోకి మార్చగలిగావు చెప్పు?'

'దేనికయినాకాలం, ఖర్మ, కలిసిరావాలి. రోజులు బావుంటేనేగాని మన ప్రయత్నాలు ఫలించవు అనసూయా! గీతలోలేనిది గీసుకుంటే వస్తుందా పిచ్చిమాట. యేమంటావ్! నాకుమళ్ళామంచిరోజులు వస్తే ఆయన మనసూ కుదుట పడుతుంది. ఆయనంతట ఆయనే మంచిమార్గంలోకివస్తారు. లేదా నాఖర్మం యెట్లాజరగాల్నో భగవంతుడు యెలారాసి పెట్టాడో అలాజరుగుతుంది. భగవంతుని మీద భారంవేశాను. అంతేగాని ఆయన సౌఖ్యానికి అడ్డంపోయి ఆయన్ని కష్టపెట్టే,

నేనుకష్టపడీ, దెబ్బ లితిని, తిట్లుతిని మనశ్శాంతి ఆయనకు లేకుండా నాకు లేకుండా చేసుకోవటమేగాని, అంత వేశ్యావ్యామోహం గలవారు మనం యిల్లు దాటివెళ్ళవద్దని చేతులుపట్టుకుని కాళ్ళ కు అడ్డాలుపడి బ్రతిమాలుతే వేశ్యలయిళ్లకు వెళ్ళకుండా మా నారా?'

'నువ్వుచెప్పిన మాటనిజమే వదినా!'

'అమ్మా! అమ్మా!' అంటూ వీధులో ఆడుకుంటూ పరిగెత్తుకు వచ్చాడు మణి.

'యేం నాన్నా! మణీ. యిల్లారా తండ్రీ! అనసూయా! నామనసులోవున్న విచారాలన్నీ నాచిట్టితండ్రిని చూస్తే మరు పుకువస్తాయి. భగవంతుని దయవల్ల వెయ్యేళ్ళకువాడు నాకళ్ళ ముందు కులాసాగావుంటే నాకు అదేపదివేలు. నాకు ప్రపంచ కంలో కావల్సిందేంలేదు. యిటారానాన్నా!' అంటూ మణిని దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది వొళ్ళో కూర్చోపెట్టుకుని పద్మావతి-

'యేంనాన్నా! అంతతొందరగా అమ్మా! అమ్మా అం టూవచ్చావ్' అంది పద్మావతి మణిని ముద్దాడుతూ.

'నాన్న వస్తున్నాడమ్మా.'

'అందుకా తొందరగా అమ్మా! అమ్మా అంటూ లోపలికివచ్చావ్! చూశావా అనసూయా! తండ్రిఅంటే ప్రాణాలు విడుస్తాడు. తండ్రిని చూస్తేసరి యిహా నాదగ్గర వుండడు. యిహా ఆయన యింటికిరాని రోజుల్లో నాన్నా! నాన్నా! అని కలవరిస్తాడు. అమ్మానాన్న యేడే, నాన్న యేడే,

అని య్యేపై సార్లు అడుగుతాడు. సమదాయించి చెప్పలేక నా ప్రాణాలుపోతాయి:-'

'అన్నయ్యవస్తున్నారు కాబోలు నేను వెళతాను వదినా.' అంటూ అనసూయ వెళ్ళిపోయింది. మాధవరావు యింటికి వచ్చాడు. నాన్నా! నాన్నా! అంటూ మణి యెదురుగుండా వెళ్ళాడు. విసుకుదలగా మాట్లాడకుండా పరధ్యాన్నంగా వూరు కున్నాడు మాధవరావు. నాన్నా! నాన్నా! అంటూన్న మణిని 'వుండు మణీ భోంచేసి త్వరగా పోవాలి పనివుంది' అంటూ మణిని తప్పనిసరిగా ముద్దుపెట్టుకుని మాధవరావు భోంచేసి బట్టలు వేసుకుంటున్నాడు.

'అమ్మా నాన్ననోరు యేమిటో వాసన వేస్తోందే!' అన్నాడు మణి. ఆమాటవిని తండ్రి మణిని కొడతాడేమోనని ఆమాటపైకి రాకండాచేసింది మాటతప్పించి తల్లి.

'రాత్రి మీకోసమై మణి నాన్నా, నాన్నా, అంటూ అల్లాడిపోయాడు.' అంది పద్మావతి.

'ఊఁ ...సరే. మంచిమాటే. యింకేం...కడుపునిండింది,

'మీరు వాడికంటికి కనపడకపోతే, మీకోసమై బెంగ పెట్టుకుంటాడు. అమ్మా నాన్నయేడే, నాన్నయేడే అంటూ వెంటవెంటపడి నోరునొప్పిపుట్టేటట్లు అడుగుతాడు.'

'వాడన్నమాటేం నువ్వు బెంగెత్తుకోవ్ నేనుయింటికి రాకపోతే!? పసిపిల్లాడు అన్నీ వాడిమీద తోసేస్తావ్ యెం దుకూ?!'

'అడగండి వాడిని యెదురుగానే వున్నాడుగా రాత్రి

యెన్నిసార్లు అడిగాడో మిమ్మల్ని! నాన్నా మణీ! రాత్రి నాన్న యేడీ అని అడగలా నువ్వు నన్ను?'

'రాత్రి రాలేదేం నాన్నా?' అన్నాడు మణి ముద్దులు మూటకడుతున్న ముచ్చటైన మాటలతో. విని మాట్లాడకుండా వూరుకున్నాడు తండ్రి.

'వాడికి అన్ని చెప్పి వాడిచేత అడిగించటం నేర్చుకున్నావ్! యిదొకయెత్తేశావేమిటి?'

'లేనిపోయింది యిదొకటా?'

'యేడిశావ్ లేవే! యీమాత్రం యెవడికి తెలియదూ. నేను అడిగితే తిడతారు అని అభమూశుభమూ యెరగని పసి వాడిచేత అడిగిస్తావ్?! యింత తెలివితేటలు వున్నాయిగనుకనే నీరాత యిలారాశాడు భగవంతుడు.'

'నాకు మంచిరోజులు వస్తే మీబుద్ధి మారకూడదా?'

'ఆఁ నీకూనాకూ యిహ మంచిరోజులు రావటం పరలోకంలోనే.'

'పోనీయండి! అంతమాటెందుకు- బ్రహ్మరాశినరాతలో యెలావుంటే అలాజరుగుతుంది. యితరుల మేలునూ, యితరుల అనుభవాలనూ చూసి యేడిస్తేమటుకు వస్తాయా పిచ్చి మాటగాని.'

'యేడిశినట్లేవుంది నీవెధవముండ వేదాంతం కట్టిపెట్టు.'

'మీరు నన్ను విసర్జించి యెలాప్రవర్తిస్తున్నప్పటికి నా వరాల తండ్రి నా మణినిచూసి మనసులో రాత్రింబవళ్ళూ కలవరపెడుతున్న విచారాలన్నీ మరిచిపోతున్నాను.'

'అబ్బో! నువ్వుచాలా విచారపడుతున్నావు నావల్ల! యింతా అంతా అని చెప్పటానికి వీలా?!'

'నేను కనక మీతో యింతకాలం మీరు యెలా ప్రవర్తిస్తున్నా పోనీ ఆయన సౌఖ్యానికి అడ్డుపోవటం యెందుకు-నారోజులు మంచివికానందున ఆయనమనసు అలాతిరిగిపోయింది. యెప్పటికైనా నాకు మంచిరోజులువస్తే ఆయనమనసు అప్పుడే మారుతుంది, అని మనసుని నిర్ధారణచేసుకుని భగవంతుడు దుఃఖాన్ని మరిచి పోమ్మని యిచ్చిన మణిని పోషణచేసుకుంటూ విచారాలన్నీ మరిచిపోతూ మంచిరోజులకు యెదురుచూస్తూ కాలంగడుపుతున్నాను. మరొకత్తె అయితే యేలావుండేదో మీపని? ...'

'నన్నేంచేస్తుంది, దానినోట్లో మట్టికొట్టుకుని అదే పోతుంది!'

'నేను మీకు ఒక్కమాట చెప్పదలుచుకున్నాను మీరు కోప్పడకుండావుంటే ...' అంది వినయంగా భర్తతో పద్మావతి.

'యేమిటో చప్పున చెప్పియేడవరాదూ?'

'యేమిటి మీకంత తొందర?'

'నేను పోవాలి నాకు యిహానీసేవచెయ్యటమేనా పని.'

'నాకుసేవలు యేం చేస్తున్నారు మీరు.?'

'నువ్వు చెప్పదలుచుకుందేమిటో చెప్పవేమిటే మేళాం! దరిద్రింగావుంది నాకు నీతో.'

'మీరూ...'

'ఊం... యేమిటి?'

'మీరు త్రాగుడూ ... రాత్రిపూట యిల్లు విడిచి వుండటం మానెయ్యండి. మిమ్మల్ని కాళ్ళుపట్టుకుని బ్రతిమాలుతున్నాను!' అంటూ పద్మావతి భర్తకాళ్ళు పట్టుకోబోయింది.

'ఛీ ... అవతలకుపో ... నీ ముఖంచూస్తే దరిద్రం కూడాచుట్టుకుంటుంది ...' అంటూ పద్మావతిని కాలితో తన్నేడు. ఆతన్నుతో ప్రక్కకు పడింది పద్మావతి.

'మద్యపాన పిశాచం మనయింట్లో వంట్లో ప్రవేశించిందీ అంటే యింట్లోవున్న సొమ్ముల్నూ, వంట్లోవున్న రక్తమాంసాలనూ పీల్చిపిప్పిచేస్తుందండీ!, అయినా త్రాగుడు అలవాటు యేనాడూ మన యింటానంటాలేంది, యీపాడు అలవాటు మీకు పట్టుపడిందేమిటి! భగవంతుడు మనసంసారాన్ని యిలా అధోగతిపాలు చేశాడేమా! మీమనసును యిలా త్రిప్పేశాడేమా! అని నేను రాత్రింబవళ్ళూ విచారంతో కుళ్ళిపోతున్నాను. ఇలామీరు త్రాగి యింటిమొఖం చూడకుండా వీరా యిష్టము వచ్చినట్లుగా పెళ్ళాం యెలాపోయినాసరే! కొడుకేమయినాసరే నాకెందుకు అన్నట్లునా మీరు మమ్మల్ని తలచనైనా తలచకుండావుంటే మాగతి యేంకావాలి చెప్పండి?'

'సంతోషించాంగాని యిహ ఆపెయ్ నీలెక్చరు...'

'ఒకానొక బిడ్డ - వాడు ప్రతిరోజూ రాత్రి పూటా నాన్నా అంటూ మీకోసంకలవరించినా! మనకి యేపదిమంది వున్నారు చెప్పండి! వున్న ఒక్కడినీ మనం సంతోషంగా ముద్దుగా పెంచుకోక వాడిని హోరున యేడిపిస్తే మనకికూడా బిడ్డలముచ్చట

యేంతీరుతుంది! మన కడుపున పుట్టినందుకు వాడి కేం సుఖంగా వుంటుంది. చెప్పండి?...'

'నీ యెత్తులన్నీ నాకు తెలుసునుగాని యిహ అంతటితో నోరుమూసుకోయ్! ... నువ్వేంనాకు చెప్పక్కర్లేదులే. ఆమాత్రం నాకు తెలుసులే. మరి నిలాదపెట్టి చెపుతావెందుకూ నీమాత్రం తెలవినాకు లేదనుకున్నావా. ఆమాత్రంనేను గ్రహించలేనను కున్నావా? ... యేమిటో తెలివి వలకపోస్తుంది బోడిముండ తెలివి...'

'యిప్పటికే అయిపోయిందేమో అయిపోయింది. యిహ నుంచి అయినా మీ దుష్ప్రవర్తనను మార్చుకోకూడదటండీ. యీసౌఖ్యాలూ, అరిచేతులో స్వర్గంచూపించే టక్కరి ప్రేమ లూ, క్షణభోగములు, మూణ్ణాలముచ్చటలు, యివేం శాశ్వత భోగభాగ్యాలుకావు. బెల్లంవున్నంతవరకే యీగలుముసురు తాయి. ఆమాటమటుకు గట్టిగా నమ్మండి నేనువున్నా పోయినా'

'నువ్వు అప్పుడే యెక్కడికిపోతావ్ యేట్లోకి. పాపీ చిరా యువుఅని నీబోటి పాపిష్టిముండలు చప్పున చావరు. పుణ్యా త్ములు చప్పున దాటిపోతారు. నీకేం భయంలేదు. కలకాలం నా ఆయువుకూడా పోసుకుని కాకిలాగా బ్రతుకుతావ్!'

'మీరు యెన్నిఅన్నా పడతాను. మీరు అనవలసిన వారు నేను పడవలసినదానను, మీరు త్రాగుడూ, వేశ్యల గుమ్మంతొక్కటం మానేశారూ అంటే నా జీవితం అంతా మీ పాదసేవచేస్తూ సంతోషిస్తాను.'' అంది పద్మావతి దణ్ణంపెడుతూ భర్తకి.

'పిచ్చి పిచ్చివాగుళ్ళు వాగితే చెప్పుదెబ్బలు తింటావ్! యింటికివస్తే యిటువంటివాదం వస్తుందనే యింటికి రావటం కూడా మానేశానునేను_ నాయెదురుగాలే పో...యింట్లోకి. పని చూసుకోరాదూ. పో ...అని భర్త కోపంగా మాట్లాడటం తోనే కళ్ళ నీళ్ళుగుక్కుకుంటూ యింట్లోకి వెళ్ళిపోయింది పద్మావతి. పద్మావతి యింట్లో పనిమీద వుండగాచూసి పెట్టె తాళంతీసి యన్ మార్కుల గొలుసు యెత్తుకుపోయాడు మాధవరావు.



# 3

‘ఆయనో పెద్ద రసికుడు అని మనం అనుకోవాల్ననో యేమిటో తెలివంతా ఒలకపోస్తాడమ్మా! మాధవరావుగారు.’

‘అయ్యో! ఆయనోగొప్ప తెలివితేటల గలవాడనీ, గొప్ప అందగాడనీ, రసికాగ్రేసరుడనీ, మనం అనుకోవద్దంటే మరి.’

‘బావా! బావా! అంటూ మర్యాదాగా వరసపెట్టి పిలుస్తామూ ఆకాశం అంటుతాడు అప్పా.’

‘నీలవేణీ! యివన్నీ నీకు క్రొత్తగా వుంటాయి. కొంత కాలం సానెవృత్తిలో సార్వీసు పొందావంటే నీకళ్ళముందు యిటువంటి ప్రియులు రోజూ వచ్చిపోతూవుంటారు. కొందరు పెంపుడు కుక్కల్లాగా యింట్లోనే పడివుంటారు యెప్పుడూ మనని అంటి తిరుగుతూనే వుంటారు. కొందరు వేశ్యలకు దాశ్యం చేస్తూ వుంటారు. కొందరు వేశ్యలపైన వ్యామోహంవల్ల కులంకూడా పోగొట్టుకుని వేశ్యల చేతికూడేతింటూ అదొక విధమైన ఆనందం అనుభవిస్తూ వుంటారు. విటులలో రకరకాలు నీలవేణీ!’

‘మాధవరావుగారి కోతలు చూస్తూవుంటే ఒక్కొక్కప్పుడు నాకు వళ్లు తగలడుతుంది అక్కా.’

‘మాధవరావుగారేకాదు నీలవేణీ! వేశ్యల యింటికివచ్చే ప్రతివిటుడూయింతే! వారి వారి తెలివితేటలు మనదగ్గర ఒలకపోసుకుంటారు మనం యింతవాడు యీయన అని మెచ్చుకోవాలని. వారి షోకులన్నీ, వారి భాగ్యమంతా, వారి దర్జాఅంతా మన యిళ్లల్లోనే తెచ్చిగుమ్మరిస్తారు. సమయాన్నిబట్టి మాటలు

విసిరేస్తూవుంటారు. మన మెప్పుదలలు పొందాలని చూస్తారు. యీ విటులలోవుండే పెద్ద రోగమే యిది.'

'మాధవరావుగారు ఒక్కొక్కప్పుడు యెక్కడుంటే అక్కడమీదపడి ముద్దు పెట్టుకుంటాడు యెంతమంది వున్నా సరే! యితరులు వున్నారనికూడా సందేహించడమ్మా!'

'అవునవును మహా బడాయికోరులే! యింకెన్నాళ్లులే అత నికీ దగ్గిరకువచ్చాయి అంపకాల రోజులు. అతనేకాదు మనయిళ్ల కొచ్చేవారు యెవరయినాసరే. యెన్ని సరసాలాడినా, యెన్ని విధాల హాస్యాలాడినా, ఆఖరికి అనరాని మాటలన్నా మీదపడి ముద్దులాడినా, యేం చేసినాసరే, డబ్బు వున్నంతవరకు యింకా ఆతని మనసునికి సంతోషం కలిగించి యెన్నివిధాల లాలనచేసి డబ్బు గుంజాల్సి అన్నివిధాలా డబ్బు పీల్చిపారెయ్యాలి. ఫకీ రయింతర్వాత వాడు మనల్ని పల్లెత్తుమాటఅంటే పళ్లు రాలగొట్టి బైటకు గెంటెయ్యాలి మెడబట్టి. అసలు మన వృత్తికివున్న లక్షణమే అది.' అంది శాయివేణి.

'అమ్మా! నువ్వు చెప్పినట్లుగానే అక్క మాధవరావు గారిని పకీరును చేసిందిగా. అయిపోయింది అతనిపని. అతని సొమ్మంతా మనకే పెట్టాడుగా'

'యింకా కొంచెం తడివుంది నీలవేణీ! ఆ కాస్తాకూడా గుంజేశామాంటే యిహ అతనికీ మనకీ రాం, రాం. మోహినీ! డబ్బుయిస్తాను, యిస్తానంటూ యెన్నిసార్లు అడిగినా యివ్వ డేమిటి యిదేం మొండితనం?!

'మొండితనం కాదమ్మా! పాపం! ఆయనదగ్గర డబ్బులేదు. వున్నరోజుల్లో మనకి యెలాయిచ్చేవాడో మనం చూస్తూవుండే

వాళ్లంగా! దగ్గర డబ్బులేదు లేకపోతే యీపాటికే యిచ్చేసే వాడు. డబ్బులేక యెవరినో అప్పు అడగాడట, వాళ్ళు యిదు గోయిస్తాం, అదుగోయిస్తాం అంటున్నారట. నాతో చెప్పా డుగా......'

'యీసన్యాసికి అప్పెవడిస్తాడు అమ్మాయ్?'

'అదంతా మనకెందుకు. మనకి యివ్వటమే కావల్సింది. యెక్కడనుంచైనా తెచ్చియివ్వనీ అతను యెంత తంటాలుపడితే యెవరికి కావాలి.'

'అంతేలే, మోహినీ! డబ్బువిషయం నాతోపాటుగా నువ్వుకూడా రోజు రోజూ అడుగుతూవుండు—లేకపోతే ఆసంగతే అడుగున పడిపోతుంది.'

'నేనేం అంత తెలివితక్కువదాన్నా అమ్మా! నాకురోజూ పాఠమే అది. అతనిముందు వప్పచెప్పే పాటమే అది. రాగానే'

'యెవరో తలుపు కొడుతున్నారుచూడు నీలవేణి!' అంది ముసల్ది లేవలేక. నీలవేణివెళ్ళి యెవరోగదాఅని తలుపు తీసింది. ఘుమ, ఘుమ వాసన్లతో గ్లాస్కో బట్టలతో లోపలికివచ్చి గట్టిగా భుజాలు పట్టుకుని వూపూతూ గఫ్న నీలవేణిని ముద్దు పెట్టుకున్నాడు మాధవరావు.

'అబ్బ! చూడవే అమ్మా' అంటూ హొయ్యారంగా కేక వేసింది నీలవేణి. నీలవేణి మాటవిని మాధవరావు వచ్చాడని తెలుసుకుని మాటలు ఆపేసి గదిల్లోంచి సావిట్లోకి వచ్చారు మోహినీ, తల్లీ.

'మాధవరావుగారా వచ్చింది. మోహినీ! అడుగోనే నీ

మాధవరావుగారు. బాబూ! యింటికె వెళ్లకండా, మాయింట్లోనే వుండిపోండి మీరు.'

'యేం శాయివేణీ! అలా అంటున్నావ్?!'

'మీరు వున్నంతసేపూ మీతో కులాసాగా మాట్లాడుతూ, మిమ్మల్ని చూసి సంతోషంతో పూరిపోతున్నట్లు వుంటుంది. మీరలా గుమ్మందాటి వెళతారా యిహ యేమిటో నీరసించిపోతుంది మనిషి! యిహ మీరెప్పుడు వస్తారా అని కళ్లల్లో వూపిరెట్టుకుని కలవరిస్తూ కూర్చుంటుంది. యే మాట చెప్పినా వినిపించుకోదు. ప్రాణాలన్నీ మీమీదే వుంటాయి కాబోలు- పరధ్యాన్నం యెక్కువ!'

'నిజంగా మా అమ్మ చెప్పినట్లు మీరు మాయింట్లోంచి వెళ్లిపోయేటప్పుడు యేమిటోగాని తమాషాగా వుంటుంది నామనసులో. మీరు నిమిషం కనపడకపోతే యేమిటో బెంగగా వుంటుంది. నాకు యేమీతోచదు.' అంది మోహిని మాధవరావు రాకకు ఆనందిస్తున్నట్లుగా-

'అమ్మయ్యో! యెంత మొఖం అయిందేనీకు మాధవరావుగారిని చూసేటప్పటికి. నిజంగా బాబూ! మీరు మాయింట్లో లేనప్పుడు దాన్ని చూస్తే నాప్రాణం నీరవుతూ వుంటుంది. మీరు యింటికి వెళ్ళేటప్పుడు వెంబడి తీసికెళ్ళనన్నా తీసుకువెళ్ళండి.'

'అంతే శాయివేణీ! నిమిషం మోహిని నాకంటపడకండా వుంటే అదేమిటోగాని నాకు మరీతోచదు. మోహిని మోహనాకారం నాకళ్ళముందు కనబడుతూవుంటేనే నాకు కులాసాగా కాలం గడుస్తుంది. లేకపోతే ఆనాడు ప్రపంచకంలో వున్నట్లే వుండదు నాకు...'

'అలా అలవాటయిపోయింది మోహినికి, మీకూ. మీరు మాయింటికి వచ్చి నిన్నా, మొన్నా! నాలుగయిదేళ్ళు అయిందాయె మరి.'

'యెక్కడ నాలుగయిదేండ్లే! యేడెనిమిదేండ్లయితే! అల్లుణ్ణి చూసేటప్పటికి ఆనందంతో మతికూడా పోతోందేమిటి అమ్మా!' అంది మోహిని.

'యేమోలేవే! పెద్దముండని నాతో యేమిటే మీకు!

'నీలవేణీ! యివాళ అట్లా దూరం, దూరంగావున్నావేం?!' అన్నాడు చిరునవ్వుతో వాలుగాచూస్తూ.

'యేమోబాబూ! దగ్గరగానుంచుంటే నువ్వు అసలు మంచివాడివికాదు.'

'నిన్నేమీ అనను కాని సిగరెట్లు తగలెయ్యాలి అగ్గిపెట్టి తీసుకురా!' అంటూ ప్రక్కజేబులో చెయ్యిపెట్టి ఫేషింగ్ షో పెట్టితీశాడు మాధవరావు. జేబూవంక చూశింది నీలవేణి. పల్చటి గ్లాస్కోచొక్కాజేబూలో వున్న వందరూపాయల నోట్లు నీలవేణి కంటపడ్డాయి.

'బావగారు! యివాళ ఫేషింగ్ షోలు తాగుతున్నారే!?' అంది నీలవేణి వందరూపాయల నోట్లవంక చూస్తూ.

'ఒకప్పుడు మటుకు? ఆయన యెప్పుడూ హైక్లాస్ సిగిరెట్లే తాగుతారు' అంది మోహిని మాధవరావుని వుబ్బేస్తూ.

'మనసంగతంతా మోహినికి తెలుసు నీకేం తెలుసే! నిన్న కాక మొన్న కళ్ళు తెరిచిందానివి!. పో...అగ్గిపెట్టి తీసుకురా... కదలవేం నీలవేణీ?!'

'దానిదగ్గర పెంకితనం వుందండీ కొంత. నీక్కాదు నీల

వీణే! అగ్గిపెట్టి తెచ్చిపెట్ట మని బావచెప్పేదీ?!' అంది మోహిని నీలవేణిని కోప్పడుతున్నట్లుగా.

'నీదగ్గరకు యెవడొస్తాడోగాని వాడు చస్తాడు నీలవేణీ! పోనీవేమోహినీ! దాన్ని కోప్పడక. అది సంతోషంగా వుండక పోయిందాంటే నాకు సర్దాగావుండదు.' అన్నాడు మాధవరావు. నీలవేణి లోపలకివెళ్ళింది. సావిట్లోవున్న తల్లిని లోపలకురమ్మని సౌజ్ఞ చేసింది. తల్లి లోపలకువెళ్ళింది.

'అమ్మా! మాధవరావుగారి జేబూలో వందరూపాయల నోట్లు వున్నాయే' అంది నీలవేణి సంతోషంతో.

'యెన్ని నోట్లున్నాయ్?'

'యేమో! నోట్లకట్టవుంది. మరి యెన్నివున్నాయో?'

'నాలుగు మూడొందలు వుంటాయా?'

'యింకా యెక్కువే వుండవచ్చునే.'

'ఆడబ్బును యెలాగైనా మనం కొట్టేసేమార్గం ఆలోచించాలి నీలవేణీ. మనం డబ్బు యివ్వండిఅని అడిగితే?—'

'యివ్వండని అడిగితే చస్తేయివ్వడు. యిన్నాళ్లనుంచి మనయింటికి వస్తున్నప్పుడు ఆమాత్రం ఆయనసంగతి మనకి తెలియదూ?' చెల్లెలూ, తల్లీ, యింట్లో గుసగుసలాడుకోవటం విని వచ్చింది మోహిని.

'అగ్గిపెట్టి యేదే నీలవేణీ?'

'వుండుమోహినీ! అగ్గిపెట్టీ అద్దాన్నమూ. మోహినీ! మాధవరావుజేబులో వందరూపాయిల నోట్లకట్ట వున్నదట'

'యెవరు చూశారూ?'

'చెల్లి చూసిందిటా-'

'యేమో? నేను యింతవరకు చూడలేదు. వున్నా యేమో'

'ఆడబ్బును యెలాగైనా మనం కొట్టేయాలి మోహినీ! యిటువంటప్పుడు మనం అశ్రద్ధ వహించామంటే నోట్లో మన్ను పడుతుంది.'

'ఊఁ...యేం చేద్దామంటావో ఆలోచించు అమ్మా!'

'ఆలోచనకి యేముంది. మా రోజుల్లో యిటువంటివి తెల్లవారిలేస్తే యెన్ని చేస్తూవుండేవాళ్ళం, యెన్ని చూస్తూవుండేవాళ్లం. బాగా వొళ్ళు తెలియకుండా, యేంచేస్తున్నది గుర్తుపట్ట లేకుండా తాగించేసేది జేబూల్లోవున్న నోట్లు కొట్టేసేది. ఒళ్ళు తెలియక యేమైనా పిచ్చివాగుళ్ళు వాగుతూవుంటే బండీలో పడేసి లింగయ్యనిచ్చి యింటికి పంపించేది.....' అని శాయి వేణి చెప్తూవుండగానే లింగయ్య మోహిని యింట్లోకివచ్చాడు.

'అడుగో లింగయ్యబావకూడా సమయానికేవచ్చాడు.' అంది మోహిని.

'యేమిటి విశేషం మోహినీ?' అన్నాడు లింగయ్య.

'లింగయ్యా! నీతో పని వచ్చిందిమాకు.' అంది శాయి వేణి.

'నాతో మీకూ, మీతో నాకూ పని లేందెప్పుడు శాయి వేణీ?' అన్నాడు లింగయ్య నవ్వుతూ.

'ఆపనులువేరూ, యీపని వేరూ. యీవాళ మాధవరావు జేబూలో వందరూపాల నోట్లుకట్ట కనిపిస్తోంది. ఆ నోట్లకట్టను యెలాగయినాసరే యుక్తిగా మనం కొట్టెయ్యాలి, లింగయ్యా!'

'అదెంతపని శాయివేణీ?, గట్టిగా తలుచుకుంటే అరగంట

పట్టదు. ఒళ్లు తెలియకుండా తాగిపోయేదీ కొట్టేసేదీ.' అన్నాడు చిటికలేస్తూ లింగయ్య.

'నేనూ అమాటే చెపుతున్నాను అమ్మాయిలతో లింగయ్యా!'

'నామాట యేమిటి శాయివేణీ?'

'పనికానీ లింగయ్యా! తర్వాత మాట్లాడదాం.'

'ముందుగా అనుకోవటం మంచిది శాయివేణీ.'

'ఆసొమ్ములో నీకుకూడా వాటా యిస్తాంలే సరేనా?'

'ఆమాటన్నావ్ బాగుంది. ప్రయత్నం మొదలెట్టండి మరి.'

'మోహిని గదిలోకివెళ్ళి మామూలుగా త్రాగుడు మొదలెడుతుంది, కాస్త వంట పట్టేంతర్వాత మనం వెళదాం. యేమంటావ్! లింగయ్యా.'

'అలాగేచేదాం శాయివేణీ! మోహినీ! నువ్వు గదిలోకి వెళ్ళు!'

'లింగయ్యబావా! నువ్వూ, సావిట్లోకూర్చో సమయం చూసి పిలుస్తామిమ్మల్ని.' అంటూ మోహిని గదిలోకివెళ్ళింది అగ్గిపెట్టి తీసికొని. సావిట్లో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు లింగయ్యా, నీలవేణీ, శాయివేణీ సమయంకోసం యెదురుచూస్తూ

'యింతసేపయిందేం మోహినీ?'

'అది ఒకచోటపెట్టి ఒకచోట పెట్టానని అన్నిగూళ్ళూ వెతికించింది పిచ్చి మొద్దు.' అంది మోహిని పందిరి మంచంమీద దోమతెరమధ్య కూర్చున్న మాధవరావుచేతికి అగ్గిపెట్టియిస్తూ.

'దానిపనీ, మూడు పువ్వులూ, ఆరు కాయలూఅన్నట్లు

పైలా వచ్చేస్‌గావుంది. మ తెక్కడ వుంటుంది యింకా?!' అంటూ రేఁడు పెదిమలమధ్యా వొయ్యారంగా సిగరెట్టుపెట్టి ముట్టించాడు.

'అయితే మోహినీ! నీలవేణికి యేం బేరాలు తగలటం లేదా?'

'యేం అలా అడిగారు?'

'యెక్కడా బేరాలు తగిలినట్లుగా కనబడటంలేదు నాకు'

'దానిగొడవ మనకెందుకులెండి'

'అంతేలే...'

'మీ నేమన్నా కొంచెం పుచ్చుకుంటారా?' అంది అల్మారా దగ్గరకివెళ్ళి మూతతీస్తూ మోహిని.

'యేమిటి?'

'యిది.' అని అంది గ్లాసులో పోసుకుని త్రాగుతూ.

'అదిలేకపోతే మన ప్రాణాలే నిలవవు. యిలా పట్టుకురా మోహినీ! సంతోషం అంతా దాల్లోనేవుంది. అది త్రాగితేనే సరదా యేనంటావ్?'

'నేను మీమాటకి అడ్డం చెప్పటంకూడానా?' అంటూ మోహినివచ్చి పందిరమంచంపైన మాధవరావు ప్రక్కనకూర్చుని గ్లాసులో పోసియిచ్చింది.

'త్రాగితేనేవుంది సరదా మోహినీ?'

'నిజమేనండీ మీరు చెప్పింది.'

'యేది యింకొకగ్లాసు.'

'యిహ చాలెస్తురూ!' అంది గ్లాసులో పోసియిస్తూ.

'సీసా అంతా అయిపోతుందేమోనని నీకు బెంగగా వుందేమో! నీకు కావలసినన్ని బుడ్లు తెప్పిస్తాను సరేనా మోహినీ...' అంటూ గ్లాసుపైన గ్లాసు త్రాగేశాడు. 'యింకా కొంచెం తాగండీ, యింకా కొంచెం తాగండి' అంటూ మరి కాస్త తాగించింది మోహిని.

'మోహినీ! అన్నీ బాగానే వున్నాయిగాని...బల్ షోగ్గా అలంకారం చేసుకున్నావుగాని కమ్మగా...ఒక పాట పాడు వినా లి......యెలా వుండాలి... అనుకున్నావ్... గుమ్మెత్తిపోవా లంతే!...ఊ...పాడెయ్యి.' అన్నాడు మాధవరావు వూగుతూ.

'నాకంటె మా నీలవేణి బాగాపాడుతుందండీ! అది మేళ ల్లోకికూడా వెళుతుంది. అది జావళీలూ అవీ బాగా పాడ గలదూ. యెవరిని యెలా అభినయింపట్టి మెప్పించాలో్, ఆ మెళుకువలన్నీ దానికి బాగా తెలుసును—'

'అయితే...దాన్నే పిలు...మోహినీ...పిలు...'

'నీలవేణీ! మీ బావ పిలుస్తున్నారు యిలారావే.' అంది. మోహిని. నీలవేణివచ్చి గది గుమ్మంబైట నిలుచుని –

'లోపలకు రావచ్చునా బావగారూ?' అంది.

'రా...వే...నీలవేణీ! మేము యిప్పుడేం చెయ్యటంలే దులే రావచ్చును: రా......పరవాలేదంటే...రా ఊ—'

'రావే అన్నిసార్లు పిలుపించుకోవాల్నా మీ బావగారి చేత' అంది మోహిని లోపలకు రమ్మని కన్నుగీటుతూ. లోప లకు వచ్చింది నీలవేణి.

'నువ్వు జావళీలు పాడతా...వటగా... వకటి కమ్మ గా...పాడు...'

'అభినయం కూడా పట్టవే మీ బావగారికి.' అంది మోహిని.

'ఆమాట నువ్వుచెప్పాల్నా అక్కా!' అంటూ నీలవేణి పందిరిమంచంపైన దోమతెరమధ్య కూర్చున్న మాధవరావుకి, 'యిది మంచిసమయము రారా' అని యెదురుగా నుంచుని పాడుతూ అభినయం పట్టటం మొదలుపెట్టింది. యీ హడావిడిలో మరీ త్రాగించింది మోహిని. పాటవెంబడి కొంచెం పాట పాటవెంబడి పాటా వదలకుండా పవిట సర్దుకుంటూ, కన్ను గీటుతూ, యెదురొమ్ములు యెగరేస్తూ మాధవరావును ఆకర్షిస్తూ గదిలో మేజువాణీ సాగించింది నీలవేణి. నీలవేణి అభినయంచూస్తూ ఒళ్లు తెలియక వూగుతూ ఓహో, భలే, వహ్వా, అచ్చా, భేష్, అంటూ బిగ్గరగా గళ్ళికంఠంతో ఆనందంతో అర్వటం మొదలుపెట్టాడు మాధవరావు. మాధవరావుకి తెలియకుండా పందిరిమంచంపైన ప్రక్కన కూర్చున్న మోహిని మాధవరావు జేబులోవున్న నోట్లకట్ట కొట్టేశింది ఆహడావిడిలో. ఆ నోట్లకట్ట మోహినిచేతికి చిక్కటంచూసి, తనముఖంలోముఖం పెట్టి కన్ను ఆర్పకండాచూస్తూ పిచ్చకేకలేస్తున్న మాధవరావు వంకే కన్ను మెదల్పకుండాచేస్తూ, డాన్సు చెయ్యటం మొదలు పెట్టింది నీలవేణి డబ్బు దొరికిందన్న సంతోషంతో. తన ఒళ్ళు తనకు తెలియకుండా డ్యాన్సుచేస్తూ దగ్గరగావచ్చిన నీలవేణి మీదకు వంగి ముద్దు పెట్టుకున్నాడు మాధవరావు.

'భలే...పిల్లా...ఇంకో పాటపాడు.'

'పిల్లా! అనే ధోరణిలో పడ్డావ్ బావా.'

'భలేబాగా పాడావే...'

'యిహ పాడలేనుబాబూ.' అంటూ మెరుపు తీగలాగా మాధవరావును మెరిపించి వెళ్ళిపోయింది నీలవేణి.

'అసలుపని అయిందా నీలవేణీ' అంది శాయివేణి.

'అయింది అమ్మా.'

'యేమాత్రం?' అన్నాడు లింగయ్య.

'యేమో అక్కడున్నది బొడ్డులో పెట్టుకుండి బావా'

'యింకెందు కా పిచ్చి కేకలిక్కడా, యింటికి పొమ్మని చెప్పనా నీలవేణీ?' అంది ముసలిది.

'చెప్పమ్మా! యిలా పిచ్చివాగుడు వాగుతూ కూర్చున్నాడాంటే యీరాత్రి నిద్రకూడా పట్టదు మనకి.'

'బాగా చెప్పావ్ నీలవేణీ' అన్నాడు లింగయ్య.

'అమ్మాయ్! మోహినీ! యేమిటే ఆపాడుమోత మన యింట్లో యెందుకు యింటికన్నా పొమ్మనమ్మా! యీరాత్రి అంతా నిద్రాలేదు నిప్పులూలేదు. తాగకుండావుంటే మన యింటికి రమ్మను తాగినరోజు రావద్దను మనయింటికి. మన యింట్లో యెందుకు యీమేళాం! మనకి నిద్దర్లు పట్టకుండా, తన యింట్లో పెళ్ళాందగ్గర యెంత అల్లరన్నా చేసుకోమను పొమ్మనూ...' అంది శాయివేణి.

'వింటున్నారా మాఅమ్మ యేమంటూందో.'

'యేయ్!...దాని బోసినోరు నొక్కేస్తానని చెప్పు.'

'యెవరినోరు నొక్కుతావుబాబూ! దొరికావ్ మాకు నిక్షేపరాయుడివి – రా నోరు నొక్కుదువుగాని ... రావయ్యా, జాగ్రత్తగా మాట్లాడు యేమనుకున్నావో.'

'యేయ్! మంచం దిగానాంటే మనిషిని కా నంతే ...

'యేయ్...ముసిలి...నోరు నొక్కేస్తా నంటే...'

'నీపెళ్ళాం నోరు నొక్కుకో...యెవరి నోరునొక్కితే యెవరూరుకుంటారు. నోటిపళ్ళు రాలేటట్లు తాగినపాగరు దిగేటట్లు తంతారు యేమనుకున్నావో.'

'తాగాను...నీసొమ్మేమన్నా తాగానా, నీబాబుగాడి సొమ్మేమన్నా తాగానా...యేమిటీ...'

'లింగయ్యా! యెందుకొచ్చిందిగానీ మనయింట్లో యీ దరిద్రం యేమైనా బండీ తీసుకొచ్చి బండీలో వేసుకొనివెళ్ళి యింట్లో పడేసిరా. బాబూ యీయనగార్ని'

'యేయ్!...దరిద్రంఅంటే...కొట్టేస్తా అంతే.' అంటూ మంచంమీదనుంచి లేవపోయాడు. దాంతో మీకెందుకులెండి అంటూనే చొక్కాలాగి పడేసింది మోహిని. అంతటితో శాయివేణి గదిబైటకు వచ్చేసింది. లింగయ్యా, శాయివేణి, నీలవేణి, మోహిని కలిసి అయిదువందల రూపాయలనోట్లు లెఖపెట్టుకుని భాగాలు తర్వాత పంచుకుందామనుకుని పెట్టెలో పెట్టుకున్నారు. మాధవరావును బండిలోవేసి యింటికి చేర్చేయ్యాలనుకున్నారు. ఆపని లింగయ్యకు వప్పచెప్పారు. లింగయ్య బండి తీసుకొచ్చాడు. మత్తుగా పడివున్న మాధవ రావును యిద్దరు ముగ్గురుపట్టి బండీలో పడుకోబెట్టారు. బండీ వెంట లింగయ్య వెళ్ళాడు.

'అబ్బ! వదిలిందమ్మా శని!' అంది శాయివేణి.

'గదిలోకి వచ్చినప్పుడు మంచంమీదనుంచిలేచి యెక్కడ నిన్ను కొడతాడో అని భయమేశింది అమ్మా! నాకు. అంది మోహిని.

'నన్ను కొట్టడమే!'

'ఒళ్లు తెలియకా, ప్రపంచకం తెలియకా, మన గొడవ లోనే లేనిమనిషి కొడితేమటుకు యేంచేస్తాం' అంది నీలవేణి.

'కొట్టడమే! కొడితే వాడిని చీల్చి నార తియ్యనూ. యీ రాత్రి అంతా నిద్దర చెరుపుతాడేమో అనుకున్నా ఆజోరుచూస్తే! యిప్పట్లో వదలడేమో అనుకున్నాను. పోయాడు యిహ హాయి గా నిద్దరపోవచ్చు పదండి.'

# 4

'మణీ! నిద్రపో నాయనా!'

'అమ్మా!—నాన్న . . .'

'నాన్న లేరు నాయనా. . .'

'నాన్న యెక్కడికి వెళ్ళేడే?'

'యెక్కడికని చెప్పనూ, మణీ! నాకుమటుకు యేం తెలుసునాన్నా! పడుకో వస్తారులే.' అంటూ పద్మావతి తండ్రి కోసం కలవరిస్తూన్న ముద్దుబిడ్డని ఓదారుస్తూ మంచందగ్గర కూర్చుని నిద్ర పుచ్చుతోంది. అప్పటికి అర్ధరాత్రి సమయం కావచ్చింది. మాధవరావు యింటికి రాలేదు. యింట్లో పద్మావతీ, మణీ, వున్నారు. నిద్రలోకూడా మణి 'నాన్నా! నాన్నా!' అని కలవరించటం పద్మావతికి తీరరాని విచారమయింది. కన్న బిడ్డనికూడా కండ్లతో చూడకుండా, కామాంధకారమునబడి రాత్రింబవళ్లు మయిమరచి యింటిముఖమే చూడకుండా వేశ్యల యిండ్లే స్వర్గలోకములని తలుస్తూ త్రాగుడు జువ్వ మొదలయిన దురభ్యాసములకుకూడా అలవాటువడి వేశ్యల విషకౌగిటిలో చిక్కిన భర్తప్రవర్తన తలుచుకుంటూ అట్టివానికి పుట్టినబిడ్డ మణి గతి యేం కానున్నదోగదా! భగవంతుడు నాముద్దుబిడ్డని యేం చెయ్యదలుచుకున్నాడోగదా! తండ్రి పరిస్థితి తారుమార యింది, నాగతి రాత్రింబవళ్ళూ భర్త ప్రవర్తనచూస్తూ కుళ్లి కృశించటంగావుంది, మా యిద్దరిమధ్యా నలిగిపోతున్న యీ బంగారుతండ్రి యేం కానున్నాడోగదా! అనుకుంటూ కన్నబిడ్డని చూచుకుంటూ కంట నీరుపెట్టుకుంది పద్మావతి. నిద్రపోతున్న

మణి వులిక్కిపడి అమ్మా! నాన్న, నాన్న అన్నాడు. మంచం దగ్గర కూర్చుని విచారపడుతున్న పద్మావతి పడుకో నాన్నా! నాన్నకోసం కలవరిస్తున్నావా! వస్తారులే పడుకో. నేనూ, నా కడుపున పుట్టినందుకు నువ్వూ, రాత్రింబవళ్లూ కలవరించటమే గాని ఆయనకు మనగోడవే చెవికి పట్టదు! అసలు భార్యా, కొడుకూ వున్నారనే సంగతే ఆయనకు జ్ఞాపకం వుందో, మరిచేనే పోయారో అంటూ మణిమీద చెయ్యివేసి నిద్రపుచ్చుతోంది.

'అమ్మా! నాన్న అడుగో...' అంటూన్న మణిని 'మణీ! కలవరిస్తున్నట్లుగా వున్నావ్, కళ్లు తెరువు నాయనా' అని మేల్కొల్పింది పద్మావతి. మణి కళ్లు తెరిచి తల్లివంక చూశాడు.

'అమ్మా! యేడుస్తున్నావెందుకే?'

'యేంలేదు నాన్నా! నిద్రపో—'

'నాకు చెప్పవ్! యేడుస్తున్నావెందుకే?'

'నేనేం యేడవటంలేదులే నాయనా, పడుకో, నిద్రపో. నిద్ర లేకపోతే నీకు జబ్బు చేస్తుంది, అసలే జబ్బుశరీరం.' అంది పద్మావతి.

'అమ్మా! నాన్నకోసం యేడుస్తున్నావా?'

'... ... ... ...'

'మాట్లాడవేం అమ్మా?! నువ్వు అలా యేడుస్తుంటే నాకుకూడా యేడుపు వస్తోంది.' అంటూ మణి బిక్కముఖం పెట్టాడు- కళ్ల నీరుకారుస్తున్న తల్లి ముఖంవంకచూస్తూ.

'మణీ! నేనేం యేడవటంలేదు! నీకు యేడుపెందుకు నాయనా. నా బంగారు తండ్రివి నువ్వు యేడిస్తే నేను చూడగలనా. నీతల్లి బ్రతికి వున్నంతవరకు నీకు అటువంటి అవస్థ యేం

అక్కర్లేదు.' అంటూ మణిముఖంమీద ముఖంపెట్టి కొసరి, కొసరి ముద్దుపెట్టుకొని —

'యిహ పడుకో నాయనా, నేను యిక్కడేవుంటాగా నువ్వు నిద్రపోయేదాకా' అంది మీద చెయ్యివేసి నిద్ర పుచ్చుతూ.

'నువ్వ మరి కళ్లనీరు తుడుచుకో నేను నిద్రపోతాను' అంటూ తల్లి పవిటచెంగుపెట్టి తల్లి కళ్లనీళ్ళు తుడిచాడు మణి. అప్పుడే పద్మావతి పడకగదిలోవున్న గడియారం పన్నెండు గంటలు కొట్టింది. వీధితలుపు దబా, దబా కొడుతున్నట్లు మ్రోత వినపడింది పద్మావతికి. భర్త యింటికి వచ్చాడనే సంతోషం పద్మావతి ముఖంలో తొణికిసలాడింది. కళ కళలాడుతూ చంద్రబింబంలాంటి ముఖంతో గబ గబావెళ్ళి వీధితలుపుతీసి చప్పున వెనక్కు తగ్గి తలుపుచాటుగా నుంచుని—

'యెవరుమీరూ?' అంది.

'మేము కళావంతులమండీ.' అన్నాడు లింగయ్య.

'యెవరికోసం వచ్చారు?'

'మాధవరావుగారి యిల్లు యిదేనాండి?'

'అవును. ఆయన యిప్పుడు యింట్లోలేరు.'

'యింట్లో లేరని నాకూ తెలుసునులెండీ...'

'తెలిసి యెందుకు వచ్చారు?...'

'మాధవరావుగారు బాగాత్రాగి ఒళ్ళు పై తెలియకుండా మా యింట్లో వచ్చిపడి మమ్మల్ని నానాబూతులూ తిడుతూ వాళ్లమీదపడి, ముద్దులు పెట్టనూ, వీళ్లమీదపడి ముద్దులుపెట్టనూ, సిగరెట్లు ముట్టించి మీదపడెయ్యనూ, అన

రానిమాటలు అననూ, వెకిలి నవ్వులు నవ్వనూ, ఒక టేమిటి యివాళ మాయింటపడి చేసినఅల్లరి యింతంత కాదండీ.'

'మీయింటికి యెందుకు వచ్చారు యీయన?'

'మావాళ్లకూ ఆయనకూ స్నేహంలెండి'

'అలాగా......కొంపలుతీసే స్నేహాలా?'

'తరువాత మీరేమన్నా అనుకోండి. మాధవరావుగారు తనఒళ్ళు తాను యెరగకుండా వున్నాడు. నెమ్మదిగా బండీలో పడుకోబెట్టి తీసుకొచ్చాను. బండీలో వున్నారు యిహ మీ యిష్టం' అన్నాడు లింగయ్య.

'చివరికి మా సంసారం యింతవరకు వచ్చింది!..... యింకెన్ని కష్టాలు పడాలో్న అప్పుడే మా బ్రతుకు తెల్లవారిందీ?' అంటూ పద్మావతి యేడ్వటం మొదలుపెట్టింది.

'నేను వెళుతున్నానండీ!' అన్నాడు లింగయ్య.

'అలా యింట్లోనైనా పడుకోబెట్టి వెళ్ళండి. యీ అర్ధరాత్రి సమయాన యింటికి తీసుకువచ్చి యిలా బండీలో పడుకోబెట్టి వెళితే యెలా' అంది పద్మావతి. పాపం! లింగయ్యకు జాలి కలిగింది పద్మావతి మాటలకు. లింగయ్యా బండీమనిషి పట్టుకుని మాధవరావును యింట్లో పడుకోబెట్టి వెళ్ళారు. మాధవరావు స్థితి చూస్తుంటే పద్మావతికి మనసు మనసులోలేదు. నాన్నా! నాన్నా! అంటూ తండ్రిని పలకరించబోతాడు మణి. ముత్యాలొలికే ముద్దుమాటలు వింటానికి మాధవరావు మన స్మరణలో వుంటేగా! తండ్రి పలకలేదని యేడుస్తూ పడుకున్నాడు మణి.

'యిదుగో యిటుచూడండి. యేమిటి మీకీ అవస్త!'

అంది మాధవరావు ముఖంలోకిచూస్తూ పద్మావతి —

'... ... ... ...'

'మాట్లాడరేం! ... యెవరు నేర్పారు యీ తాగుడు మీకు?'

'నువ్వే నేర్పిందేగా!...మోహినీ'

'అయ్యో!...యింకా మీరు నాకు యెలా దక్కుతారు. ఆ వేశ్యాపిశాచాలు యెలా దక్కనిస్తాయి?! వాటికితోడు అగ్నికి వాయువు తోడైనట్లుగా యీ మధుపాన పిశాచం మిమ్మల్ని యెలా ఆవహించింది! అయ్యో! భగవంతుడు మనల్ని యింత అన్యాయం చేశాడేమండీ?!'

'మోహినీ......యేదీ...మధురమైన ఒక కిస్'

'నేను మోహిన్ని కాదండీ—'

'అహః...నన్ను బాధించకు మోహినీ! నాధన మాన ప్రాణాలు...సర్వమూ నీకు అర్పించానుగదా!... యింత విశ్వాసంలేదేం...మోహినీ... నీలవేణీ!... యిందాకా నువ్వు చేసిన డ్యాన్సు భలే గుమ్‌గావుంది...యేదీ మళ్ళా డ్యాన్సుచెయ్యి...'

'నేను నీలవేణిని కాదండీ!?

'చప్...నోరుముయ్!...డ్యాన్సుచేసి యిందాకటిలాగా కమ్మటిముద్దు...పెట్టు...ఊఁ...జల్దీ...నీరుణం వుంచుకోనులేవే చిలకా!'

'అయ్యో! మీరు యిలా మారిపోయారేమండీ!' నా మాటలు మీముందు చెవిటివానిముందు శంఖు వూదినట్లుగా అయాయే!' అంటూ పద్మ భర్తకి ఆ సమయంలో యేం చెప్పినా చెవికి యెక్కదనుకుని భర్తదు స్థితికి విచారిస్తూ వళ్ళు

తెలియక మాధవరావువేసే కేకలకు మణి జడుసుకుంటాడేమో నని మణి ప్రక్కలో వెళ్ళి పడుకుంది. మాధవరావు పిచ్చకేకల తోనే భళ్ళున తెల్లారింది. మర్నాడుదయం మోహిని యింటికి వెళ్ళబోతూ మాధవరావు డబ్బుసంగతి జ్ఞాపకంవచ్చి జేబూలు వెతికి వెతికి చూసుకున్నాడు. డబ్బుకనిపించలేదు. పద్మావతితీసిం దనుకున్నాడు! ఆమెపైన మండిపడ్డాడు. మణికి తలదువ్వి సిల్కు చొక్కా తొడుగుతున్న భార్యదగ్గరకు వెళ్ళాడు.

'నాన్నా! యెక్కడికి వెళుతున్నావ్?' అన్నాడు మణి తండ్రిదగ్గరకువెళ్ళి చనువుగా-

'పనివుండి వెళుతున్నానురా'

'నేనుకూడా నీతోరానా?... యేం నాన్నా?'

'యెందుకు నానెత్తినెక్కనా? కొంపమునిగి నేనేడుస్తోంటె'

'ఒకమూల యింకా తెల్లవారలేదు అప్పుడే యెక్కడికో వెళుతున్నారే?' అంది పద్మావతి.

'యెక్కడికైతే నీకెందుకు యేట్లోకి' అన్నాడు విసుగుదలగా.

'అంత విసుగుగా వున్నారేం? మణి మీకోసం యెప్పుడూ తపిస్తోనే వుంటాడు. ఒక్కగానొక్కకొడుకూ వాడినైనా సంతోషపెట్టండి! మీరు వాడికేం చెయ్యనక్కర్లేదు. మీరు వాడి కళ్ళకి కనిపిస్తూవుంటే సంతోషంతో సగం పూరిపోతాడు. ఆమాత్రం మన కడుపున పుట్టినబిడ్డని మనం సంతోషపెట్టలేక పోతే యెలా'

'యింట్లో వుండేటట్లుగానే చేస్తున్నావ్!' అన్నాడు కోపంగా మాధవరావు.

'నేనేం చేశాను?! నావల్ల యేదన్నా అపరాధంవుంటే చెప్పండీ మీ పాదాలుపట్టి క్షమార్పణ కోర్తాను. యిహానుంచి అటువంటి తప్పులు యేం చెయ్యకుండా వుంటాను'

'నాజేబూలో డబ్బు యేమయిందీ?' అన్నాడు నిప్పులు గక్కుతూ.

'డబ్బా? మీజేబూలో డబ్బేమిటి. యెంతడబ్బు?'

'అయిదువందల రూపాయిలూ యేమయిపోయాయి?'

'యేమో! నాకు తెలియదే! అయిదువందలా! యే తుచ్ఛపుముండలు కాజేశారో! యేమయిపోయాయో మరి.'

'నువ్వు తియ్యలేదా?'

'మీ పాదసాక్షిగా నేనేం యెరగను. నేను తీసుకున్నానని అనుకుంటున్నారా మీరు? పొరపాటు పడుతున్నారు. నేనేం యెరగను. బాగా ఆలోచించుకోండి యెలా పోయాయో.' అందిపద్మావతి అయిదువందలు పోయినందుకు విచారపడుతూ.

'నిన్న నాజేబూలో పెట్టుకునివచ్చాను. యింతలోకే యేమయిపోతాయి? యే దొంగలొస్తారు నా జేబూలోవి దొంగిలించటానికీ. అంత స్వతంత్రం యెవరికి వుంటుంది. టక్కరి మాటలు మాట్లాడకు పద్మా! తీస్తే తీశావుగాని అబద్ధంమటుకు ఆడబోకు...'

'మీరు అలాఅంటే నేనేం చెప్పనూ! నేను తీసిందీలేండీ, యెవరు తీసిందీ భగవంతుడికి తెలుసును.'

'యెవరూ తియ్యకపోతే యేమయిపోతాయి అయిదు వందలు'

'మీరు డబ్బు జేబూలో పెట్టుకుని సరాసరి యింటికే వచ్చారా?'

'ఆ వెధవముండ ప్రశ్నలన్నీ నీకెందుకు, నేను అడిగిందే మిటో చెప్పు?'

'ఆ అయిదువందలూ కాజేసిన దొంగలెవరో యిప్పుడే బయలుపడతారు. నేనడిగినమాట చెప్పండి.'

'అదంతా నీకెందుకు నేను చెప్పను. నువ్వు చెప్పేదేమిటో చెప్పేడవరాదూ?' అన్నాడు విసుగుదలగా.

'రాత్రి అమ్మా! నాన్న యేడీ? అని మీకోసం మణి యేడుస్తోంటే వస్తారులే పడుకోనాయనా అని వాణ్ణి పడుకో బెడుతున్నాను సమదాయిస్తూ...'

'నాన్న చచ్చాడని చెప్పకపోయావ్!'

'అబ్బ! యెందుకండి మీకంతకోపం. అయిదువందలూ నేనే తీశానని మీకు గట్టిగా నమ్మకం వున్నట్లయితే నామెళ్లో నగలయినా అమ్మి యిస్తాను. నేచెప్పేదికూడా వినండి ...... పాపం యెక్కడుందో భగవంతుడుకి తెలియాలి ...' అంటూ యేడ్వటం మొదలుపెట్టింది పద్మావతి.

'అంతా చెప్పిఅయినాయేడువు, యేడ్చిఅయినా చెప్పు. యెందుకీ అసంపూర్తియేడుపులు. యెవరికితెలియవు యీ దొంగయేడుపులు'

'అంతలోనే యెవరో తలుపుకొడుతున్నట్లుగా నాకు మోత వినిపించింది. మీరే నామీద అనుగ్రహంచేతవచ్చారు గదా అనుకునివెళ్లి వీధితలుపు తీశాను. యెవరో లింగయ్యట, కళావంతులట...'

'అత నెందుకువచ్చాడు యిక్కడికి?'

'చెపుతాను వినండి, మాధవరావుగారియిల్లు యిదేనా అన్నాడు. అవునండీ ఆయన యింట్లో లేరు అన్నాను. అంత టితో ఆ అబ్బాయి- మాధవరావుగారు మాయింటికి వస్తూ వుంటారు. యివాళ వళ్ళు తెలియకుండా త్రాగివచ్చి మా యిం టినిపడి అందరిని యిష్టమొచ్చినట్లు తిడుతూ నానా అల్లరి చేస్తు న్నాడు. బండిలో పడుకోబెట్టి యింటిదగ్గర వప్పచెపుదామని తీసుకు వచ్చాను. — అని చెప్పి మిమ్మల్ని లోపల పడుకోబెట్టి వెళ్ళిపోయారు. అప్పటి మీ స్తితిచూసి నా గుండె పగిలిపోయి వలవల యేడ్వటం మొదలు పెట్టాను. నన్నుచూసి మణి బేర్ మన్నాడు. అప్పటి మీ స్తితి మమ్మల్ని గుర్తించేటట్లుగా లేదు. మీ దగ్గర కూర్చుని నేను యెన్ని చెబుతున్నా నా మాటలు మీ చెవిని పట్టటంలేదు. యేమిటేమిటో మీలో మీరు మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. పిచ్చ కేకలువేయటం మొదలు పెట్టారు. మీ కేకలికి మణి జడుసుకుంటాడేమోనని మణిని ప్రక్కలో వేసుకుని పడుకున్నాను యేడుస్తూ. మోహినీ, మోహినీ, అంటూ యెవరినో పిలవటం మొదలు పెట్టారు. యిలా భళ్ళున తెల్లవారింది. భగవంతుని సాక్షిగా జరిగిన సంగతి యిదీ..'

'అలా ఒళ్ళు తెలియకుండావున్న సమయంలోనే కొట్టేశా వన్న మాట నువ్వు.'

'రామ, రామ, అసలు ఆ డబ్బుసంగతే నే నెరగనండీ, లేనిపోయిన పాపం నామీద యెందుకు వేస్తారు.'

'ఊ! సరేకానీ, యింతటితోనే పోతావా యింకేమన్నా

వుందా? జేబూలోవున్న డబ్బయితే టికాయించావ్‌గాని నా తోలుకింద గీత తుడిచెయ్యలేవుగదా? యిటువంటి అయిదు వందలు నా రోజు బావుంటే లక్షతొంభై సంపాయిస్తాను-- ఖర్చు చేస్తాను. నువ్వు యిటువంటిదానివి కనకనే, నీ ఖర్మం యిలా యేడిసింది. యిటువంటి నీచపు బుద్ధులు వున్నాయి కనుకనే భగవంతుడు నిన్ను యింతలోనే వుంచాడు. యింకా నీ దశ బావుంటే నిన్ను పట్టపగ్గాలుండేవా? యెవడిని యెలా చూడాల్నో అలా చూస్తాడు. భగవంతుడేం అంత పిచ్చిముండాకొడుకు కాడు...' అన్నాడు తల వంకేస్తూ.

'యెక్కడో పోగొట్టుకువచ్చి యేపాపమూ యెరగని దాన్ని నన్ను యిన్ని అనటం, యిలా నిష్ఠూర్యపు మాటలా డటం మీకు ధర్మం కాదు. అగ్నిసాక్షిగా పెళ్ళి చేసుకున్న పెళ్ళాన్ని యిలా హోరుమనిపించటం మీకు న్యాయంకాదు. మీరు యెక్కడో పోయిన డబ్బుకే యిన్ని మాటలంటున్నారు. యింట్లో పెట్టెలలో పెట్టుకున్న వస్తువులు యెన్ని పోయినా నే నేమన్నా నోరు యెత్తి యెవరినైనా పల్లెత్తుమాట అన్నానా? నా ఖర్మం అనుకున్నాను నోరుమూసుకుని వూరుకున్నాను...'

'అసలు యీ యింటికి రావటమే నాకు దరిద్రంగా వుంది. యీ దరిద్రం నాకు యెప్పుడు వదిలిపోతుందోగాని, సుఖానవున్న ప్రాణం దుఃఖపెట్టుకోవడ మవుతోంది. రాకపోతే ఒక యేడుపూ వస్తే ఒకేడుపూ...'

'యీమాత్రం యింటికిరావటంకూడా యెక్కడ మాను కుంటారో అనే భయంవల్లనే యేది యెలా జరిగినా మీరు నా కంటికి కనపడుతూవుండటమే పదివేలని సంతోషిస్తున్నాను--'

'యేమాటకి ఆమాటే చెప్పుకోవాలి. అక్కడవుంటేనే నా ప్రాణానికి సుఖంవుంది నా దగ్గర యెలా నడుచుకోవాల్నో యెప్పుడెలా వుండాల్నో, అన్నీ దానికి తెలుసు. అసలు దాన్ని చూస్తేనే, దాని యింట్లో అడుగు పెడితేనే అదేమిటో గాని నాకు అపరిమితమైన సంతోషంగా వుంటుంది. నాతో యెంతో అనుకూలంగావుండి ప్రపంచకాన్నే మరిచిపోయేటట్లు చేస్తుంది అది ఒకక్షణం కనిపించకపోతే నా కేమిటో పిచ్చిగా వుంటుంది...నిజంగా పేరుకు తగినట్లుగా అది నా పాలిట మోహి నియే! రాత్రి అంతా దాన్ని కలవరించానని యేడుస్తావెందుకు యింకా! యిటువంటి నీచపు బుద్ధులు దాని దగ్గర ఒక్కటిలేదు. కావలిస్తే అయిదుకాదు, పదికాదు అడిగి తీసుకుంటుంది గాని యిలా చెప్పకుండా జేబుల్లోవి దొంగిలించటం యింతవరకు అది యెన్నడూ యెరగదు. అదీ యిలా చేసేటట్లయితే యింతకాలం మా యిద్దరికీ యెలా జరిగేది...'

'వేశ్యలు మీదగ్గర డబ్బు వున్నంతవరకూ అలాగే మీ మెప్పులు కోరుతూ మిమ్మల్ని నెత్తిన పెట్టుకుంటూ, మీ ఆశ్రయంవల్ల బ్రతుకుతున్నట్లుగా మీకుగౌరవమునిస్తూ, మిమ్మల్ని సుఖసముద్రంలో ముంచి తేలుస్తూ మీ మనసును రంజింపజేస్తూ వద్దన్నకొలదీ ప్రేమవర్షం కురిపిస్తారు. కపటప్రేమతో కళ్ళు కప్పుతారు. యెదటికొంపలుతీసి తమ కొంపలు నింపుకుంటారు. డబ్బు వున్నంతవరకూ విటుల మనసులను రంజింపజేస్తారు. దివాళాతీసిన విటునియందు వేశ్యకు ప్రేమవుండదు.

'వేశ్యలయిండ్లు విలాసమందిరాలు.'

'అవును మీరన్నట్లుగా డబ్బు వున్నంతవరకూ వేశ్యల

యింట్లు విలాసమందిరములే! డబ్బులేని రోజులలో విలాసవతు లగు ఆవేశ్యలే! ప్రేమను వెదజల్లిన ఆ వేశ్యలే! అరిచేతులో స్వర్గమునుచూపిన ఆవేశ్యలే! నెత్తినెక్కించుకొని పూజించిన ఆవేశ్యలే! పిటులపాలిట పచ్చి నెత్తురుతాగు నరరూపరాక్షసు లవుతారు. డబ్బు విరజిమ్మి ప్రేమను యెంతకాలం కొనుక్కుం టారు? డబ్బు వున్నంతమటుకు రెండుచేతులతో విరజిమ్ముతూ వేశ్యయిండ్లలో సౌఖ్యాలకు అలవడతారు. డబ్బులేనప్పుడు డబ్బుకోసమై వేశ్యలు ఒత్తిడిచేసినప్పుడు నీచమైనయెంతెంత పనులకైనా పాల్పడతారు. ప్రపంచం యేమనుకుంటుందో అన్న మాటే ఆలోచించుకోరు. ముందు మంచిచెడ్డలు తెలియ కుండా డబ్బంటే లెఖ్కలేకుండా వేశ్య మెప్పుకోరుతూ పైలాప చ్చిస్‌గా ప్రవర్తించి అంతకంతకి చిక్కుల్లోపడి అవస్థలపాలవు తారు.'

'యెందుకీ సొదంతా చెపుతావ్ నాకు. నేను అవస్త లపాలయితే చూదువుగానిలే నువ్వు.'

'మీమాటేకాదండీ! ప్రపంచకంమాట చెప్పాను- అయిం దేమిటో అయిపోయింది. యీ వేశ్యాసంపర్కంవల్ల మన సం సారం అన్నివిధాలా అధోగతిపాలయిపోతోంది. యిప్పటికి మీరెలా ప్రవర్తించిందీ మీమనసుకి మీకు తెలియదూ? యిక నైనా ఆ విష పురుగుల గుమ్మం త్రొక్కటం మానెయ్యండి. ఆమాత్రం సౌఖ్యం మీకు నావల్ల కల్గకపోయిందా?! నేను కాపరానికి వచ్చిన కొత్తలో నాయందు మీరెంత ప్రేమగా వుండేవారు! ఆప్రేమంతా యిప్పుడేమయిపోయిందో, నాకే తలుచుకుంటే ఆశ్చర్యంగావుంటుంది. మీరు నాయందు యింత

అయిష్టతగా వుండటానికి కారణం యేమిటో నాకు తెలియకుండా వుంది. మీమనసుకి కష్టంకలిగేటట్లు నేనేం ప్రవర్తించలేదే! మీరు నాతో మాట్లాడటమే పదివేలనుకుంటున్నాను! యిటు చూడండీ! ఆడుదానికి ప్రపంచకమంతా భర్తతోనేవుంది. భర్త సుఖపెట్టినప్పుడే భార్యకు సౌఖ్యంకల్గుతుంది. భర్త ఆదరించినప్పుడే భార్య సుఖపడుతుంది. భార్యా, భర్తల మనసులు యేకీభవించినప్పుడే ప్రపంచకం ఆనందమయంగా వుంటుంది. అట్టి దంపతుల జీవితములే ఆదర్శములు. అట్టిజీవులే సార్థకజీవులు. భార్యను భర్త ఆదరించకపోతే జీవితములో సుఖమనేది యేలావుంటుంది చెప్పండి. ప్రపంచకంలో పుట్టిన తర్వాత ప్రతిజీవి సుఖమనేది కోరుకుంటుంది గదా! పెళ్ళికానంతవరకూ కన్నతల్లి తండ్రులు సుఖపెట్టాలి. పెళ్ళిఅయిన తర్వాత చేసుకున్న భర్త సుఖపెట్టాలి! పెళ్ళి కానంతవరకూ మా అమ్మానాన్నా నన్ను యెలాచూశారో, సుఖపెట్టారో, కష్టపెట్టారో, నామనసుకి నాకు తెలుసు, పైన భగవంతుడికి తెలుసు. పెళ్ళిచేసి నన్ను మీచేతులో యెప్పుడైతే పెట్టారో అప్పుడే వాళ్ళబాధ్యత వదిలిపోయింది. నేను మీమనిషిని అయిపోయాను. నన్ను సుఖపెట్టినా, కష్టపెట్టినా, కొట్టినా, తిట్టినా ఆభారమంతా మీదే! మీరే నన్ను యిలా నా మనసును గ్రహించక, నామాట చెవిని పట్టించుకోక, కన్నబిడ్డని కూడా కళ్ళతో చూడక రాత్రింబవళ్ళు ఆవేశ్యలయిండ్లలోనే కాలంగడుపుతూ వుంటే మాసంగతి ఆలోచించేదెవరు?! మీరేయింత అయిష్టతగాచూస్తూంటే మాకష్టసుఖాలు వినే దెవరు?! నా కన్నతల్లి తండ్రులుకూడా నన్ను ఒంటరిదాన్నిచేసి పోయారు. నాకష్ట

సుఖాలు మీతోగాక యెవరితో చెప్పుకోను. ఆలకించేదెవరు చెప్పండి! మీరు యింత తిరస్కారంగా వుంటే వాడిగతీ, నా గతీ యేంకావాలి. పాపపుణ్యాలు యెరగని పసిబిడ్డ వాడి బ్రతుకూ, నాబ్రతుకూ యిలా కష్టాలతో గడిసిపోవలసిందేనా? మనకడుపున పుట్టినందుకు వాడి సౌఖ్యమయినా ఆలోచించండీ. అనుకూల దంపతుల మధ్య పడినట్లయితే వాడిముత్యాలు వలికే ముద్దుమాటలు వింటూ అల్లారు ముద్దుగా చేతులలో పెంచే వారు. నిర్భాగ్యురాలిని నాకడుపున పుట్టుటచేత అహర్నిశాలూ నాతోపాటు అలోలక్షణా అని కష్టాలతో కుమిలిపోతున్నాడు..'

'కొండంతతల్లివి వున్నావుగా, గారాబంగా పెంచుకో యెవరొద్దన్నారూ.? నాతోవుంది మీకు అవస్త నేను యింటికేరాకుండా వుంటే మీప్రాణాలు హాయిగావుంటాయి. సుఖంగా బ్రతుకుతారు. అయినానేను పోయిన డబ్బుసంగతి అడిగితే యీచాటభారతం చెప్తూతావెందుకూ నీకేంబుద్ధిలేదూ! సిగ్గూ సిరంలేని మాటలుమాట్లాడతావ్? చేసినతప్పుడుపని పైకి రాకుండా తప్పించుకోవడానికై యీ మెట్టవేదాంతాలన్నీ మొదలెట్టి మాటల సందున మరిపిద్దామనుకున్నావా? నువ్వుచేసిన యీ తప్పుడుపని మరిచిపోను. యెప్పటికీ డొక్కలో మెదులుతోనే వుంటుది నాకు.'

'నేను యెన్నివిధాలచెప్పినా- ఎన్నిసార్లు పాదాలుపట్టి బ్రతిమాలినా నామాటలు మీమనసుకి నచ్చకుండావున్నాయి అది నా ఖర్మంలెండి. రోజులు మంచివికానప్పుడు చెడు మంచిగా తోస్తూవుంటుంది. సంసారం అన్నివిధాలా యిలా వుందేమా అని రాత్రింబవళ్లూ కుళ్ళి కృశించిపోతున్నాను. నన్ను మరింత యెం

దుకు యేడిపిస్తారు. మీ రేమన్నా అనుకోండి మణిమీద ఒట్టు నాకు ఆడబ్బు సంగతి యేం తెలియదు నమ్మండి" అంటూ రెండు కాళ్ళూ పట్టుకుని బ్రతిమాలింది యేడుస్తూ.

'ఛీ...దుర్మార్గురాలా! పసిబిడ్డ వాడిమీద వొట్టేస్తావెం దుకు నీకేమిటి తెగించినదానివి అప్రమాణాలు యెన్నైనా చేస్తావు నీ ముఖంచూడకూడదు." అంటూ పద్మ యెదురో మ్ములో ఒక్కతన్ను తన్ని వెళ్ళిపోయాడు మాధవరావు. ఆ తన్నుతో వెనక్కిపడింది పద్మ. తల్లి వెనక్కిపడగానే గావురు మన్నాడు మణి.

# 5

'లింగయ్యబావా! ఆ మనిషి మర్యాదాగా అడిగితే అంత డబ్బు యిచ్చేవాడంటావా?' అంది మోహిని.

'ఒక్కనాటికి యివ్వడు. అథవా యిచ్చినా ఆ అయిదు వందలూ యివ్వటానికి యే ఆరునెలలో అడగవలసివచ్చేది యీ రోజుల్లో మాధవరావు పరిస్థితినిబట్టి.'

'చేతులో దమ్మిడిలేక చస్తున్నాడు లింగయ్యా!' అంది శాయివేణి.

'అవును బావా యీమధ్య డబ్బు దొరకక యెంతో యిబ్బందిపడ్డాడు. మరి యెక్కడనుంచివచ్చిందో యీడబ్బు?!'

'ఊఁ......యెక్కడినుంచి వచ్చేదేమిటి యీయనకేం పొలాలా బొగ్గులా. వున్న పొలమేమో మనయింట్లో కాలుపెట్టిం తర్వాత అమ్మనే అమ్మేశాడు. శెంట్లనీ, అత్తర్లనీ, ఘుమ, ఘుమలాడుతూ నాలుగురోజులు వెలిగాడు అంతటితో అబ్బాయి కాళ్లు చల్లపడ్డాయి చతికిలబడ్డాడు...'

'మరి యెక్కడిదంటావ్ యీ డబ్బు అమ్మా?' అంది మోహిని.

'యెక్కడిదేమిటే పిచ్చిమొద్దా! యే పెళ్ళాం మెళ్ళో నగలో తెచ్చి అమ్మివుంటాడు.'

'లేకపోతే యెక్కడైనా అప్పుతెచ్చాడేమో?!' అంది మోహిని.

'యీ సన్నాసికి అప్పు యిచ్చేదెవడు? దేన్నిచూసి యిస్తాడు. అలా అప్పులు యిచ్చేరోజులు వెళ్ళిపోయాయి

మోహినీ! పోనీ అతనేం చేసుకుంటే మనకెందుకు యింతకీ మనకా సొమ్ము దక్కవలసివుంది దక్కింది. అది సొమ్మూ! యేసొమ్మయితే మనకెందుకూ. అతనెలాతె స్తే మనకెందుకూ! యేంలింగయ్యా! యేమంటావ్?' అంది లింగయ్యనుచూసి శాయివేణి.

'అవును శాయివేణీ! రత్నంలాంటి మాట అన్నావ్. అది సొమ్మూ! ఒకటికాదు రెండుకాదు. అయిదువందలరూపాయలు. యెన్నాళ్ళు అవస్తపడితేరాను. అయిదువందలు మాటలా యేదో లేచినవేళ బావుంది అప్రయత్నంగా అధికాయాసం లేకుండా అయిదువందలు చేతులో పడ్డందుకు యెంతో సంతోషించాలి మనం'

'బాగా చెప్పావ్' అంది శాయివేణి.

'బావా! యింతకీ నా కృషి ఫలించిందా?'' అంది నీలవేణి.

'నీలవేణి! నా కృషి లేకపోతే పని అయేదేకాదు. బలే అభినయం పట్టావ్! ముద్దుపైన ముద్దూ, ముద్దుపైన ముద్దూ ముద్దులవర్షం కురిపించి మాధవరావును మురిపించేశావ్. నీ అభినయం, ముద్దులూ, మోహిని లబ్జుమాటలలో పడి మత్కెక్కిపోయి మయమెరచాడు. నువ్వూ, మోహినీ వూపిరాడకుండా వెంబడెంబడే ఒకరిని విడిచి ఒకరు లవ్ పోజులు విసురుతూ కష్టపడ్డారు కనుకనే మీ కష్టం ఫలించింది' అన్నాడు లింగయ్య నీలవేణినీ, మోహినినీ పొగుడుతూ.

'అదికాదు బావా! అసలు ఆయనఒళ్ళు ఆయనకే తెలియకుండావున్నాడు.'

'అవును మోహినీ! తెగతాగితే యేమవుతుంది.'

'అలా ఒళ్ళు తెలియకుండా త్రాగబోశాముగనుకనే

మనము ఆపని అంత తేలికగా చెయ్యగలిగామనుకో యేం బావా?'

'ఆమాటయదార్థం మోహినీ! తాగుబోయ్యేకపోతే మనం యింత తేలికగా యీపని చేయగలిగే వాళ్ళంకాదు. అసలు మాధవరావు దగ్గర అంత డబ్బువున్నట్లు మీకు యెలా తెలిసింది మోహినీ?'

'నాకు తెలియదు బావా! నీలవేణి చూసి మాఅమ్మతో చెప్పింది. యిద్దరూ లోపల గుస, గుసలాడుకుంటున్నారు. యేమిటోగదా అని నేను యింట్లోకి వెళితే అప్పటికప్పుడే ప్లాను వేసేసి నాతో చెప్పారు. ఊ కానీయండి అన్నాను. యిహా నీకోసం కబురుపంపుదామనుకుంటున్నాము. అంతలోకే నువ్వే వచ్చావు... నీదయవల్ల అనుకున్నపని దిగ్విజయంగా జరిగిపోయింది.'

'నాదయేమిటిలే భగవంతుడు దయ. కలిసొచ్చేరోజు వచ్చింది అన్నీ అలా కలిసొచ్చాయి అనుకో మోహినీ!'

'యింతకీ ముఖ్యమైన మాట అదీ లింగయ్యా!' అంది శాయివేణి.

'ఆడబ్బు జేబూలో పెట్టుకొని యెంత అదిరిపాటుగా వచ్చాడనుకున్నావ్ మాధవరావుగారు. దబాదబా తలుపు బాదాడు. యెవరోగదా అనుకుని తలుపుతీశాను, కన్ను చెదిరిపోయేటట్లు గ్లాస్కో బట్టలతో ఘుమఘుమ సెంటువాసనలతో యింట్లోకివచ్చాడు.'

'నీలవేణీ! వేశ్యలయిండ్లలో కాలుపెట్టిన కొత్తరోజులలో కొన్నాళ్ళవరకూ విటులు ఆరంభశూరత్వము చూపుతూ కొత్త

పిచ్చాళ్ళు క్రొత్తరగడన్నట్లు వెలిగిపోతారు. చేతులో డబ్బు ఆడుతున్నంతవరకూ యెన్ని దర్జాలైనా చూపుతారు. సెంట్లు వారు పూసుకోవటమే కాదు వేశ్యల మీద కూడా బుడ్లతో గుమ్మరిస్తారు.'

'అబ్బ! ఆసెంటు యెంతఖరీదు కలదో కాని మాయిల్లం తా ఘుమ్మంటుంది బావా!'

'అటువంటి క్రొత్తరకపు సెంట్లే విటులనూ, వేశ్యలనూ ఆకర్షిస్తాయి నీలవేణీ'

'యింట్లోకి వచ్చాడు నామీదపట్టించాడు.'

'నిన్నేంచేశాడు.?'

'తలుపు తీసే తియ్యటంతోనే గభమని నా రెండు భుజాలూ పట్టుకుని వూపిరాడకుండా వూపుతూ నొక్కి, నొక్కి ముద్దుపెట్టుకున్నాడు'

'అయిందీ! వీధిగుమ్మందగ్గర నుంచే ముద్దులతో వచ్చా డన్నమాట.' అన్నాడు లింగయ్య నవ్వుతూ.

'అయునా, యిదీ యెప్పుడూ పరాచకాలాడుకుంటూ వుంటారులే బావా!' అంది మోహిని.

'నీలవేణి మటుకు తెలివితక్కువదా! యెంతబావ అయి తేమటుకు వూరికే పోనిస్తుందా. యేకొద్దో, గొప్పో ప్రతిఫలం లేందే బావగారితో సరసాలాడుతుందా?' అన్నాడు లింగయ్య నీలవేణి వంక చూస్తూ.

'నేనూరికే పోనివ్వను బావా. వున్నమాట చెప్ప వద్దూ సమయాన్నిబట్టి అటూ, యిటూగుంజుతూనే వుంటాను. లేకపోతే యీబేవార్సు సరసాలకి మా అమ్మ వూరుకునేదేనా

నీకు తెలియదూ?'

'నేను ముందే చెప్పానుగా ఆమాట.'

'కానీ డబ్బుకాణ్ణించీ కతికే పీనాసి ప్రియులతో బుగ్గని వ్రేలెట్టుకుని అస్తమానం సరసాలాడుతూ కూర్చుంటే కానీ డబ్బు మనకంటికి కనపడేది యేలా? మన జీవనం గడిచేదెలా చెప్పులింగయ్యా? యెవరిపాట్లు వారు గడుపుకోండి, రెండబ్బులు నిలవచేసుకునే మార్గం చూసుకోండీ మీ పిప్రియులతో క్రిందాపైనా పడండి యెవరొద్దంటారూ. పడపుకత్తెకు వయసే ప్రాణంవయసులో వున్నప్పుడు గుప్పెళ్ళతో సంపాయించుకుని నిలవచేసుకోకపోతే వయసుతప్పిపోయి వళ్లుముడతలుపడి ముసల్దానవు అయినప్పుడు నీదగ్గరకు యెవరొస్తారు నీముఖం యెవరు చూస్తారు? యిప్పుడు నాముఖం యెవరన్నా చూస్తారూ? నేను నీవయసులో వున్నప్పుడు యెలా సంపాయించేదాన్నో యేమిటో, నాకోసం యెంతమంది యింటిచుట్టూ తిరిగేవారో యెన్నిమేళాలు చేసేదాన్నో నీకేంతెలుసు?...'

'బాగాసంపాయించావా అమ్మా?'

'లేదా...యేం సంపాయించక పోతేనే అంతవాళ్ళుయింత వాళ్ళయారా? మాయిల్లు అంటూ గదిలో కులుకుతున్నారు యిప్పుడు. నేచెప్పేదేంలేదు యెన్నిసార్లు బోధించినా వయసులోవుండగానే ఒకరినే పట్టుకు వేళ్ళాడక సానెవృత్తిలో సార్థకముపొంది నాలుగుడబ్బులు సంపాయించుకోమంటాను యేం లింగయ్యా! నేచెప్పిందాంట్లో తప్పేమైనా వుందా?'

'అంతకంటే యింకాచెప్పేదెవరు' అన్నాడు లింగయ్య.

'నేను అనుభవించినదాన్ని గనుక నా అనుభవం మీకు

చెపుతున్నాను. సానెవృత్తిలో దిగింతర్వాత ఒక్కరినే నమ్ము కుని నమ్మకంగా ఆయనతోనే వున్నంత బుద్ధితక్కువా, అంత వెఱ్ఱితనం ఇంకొకటి లేదు. అంతకాడికి సానెవృత్తిలో ప్రవే సించకుండా వొడ్డున వుండటమే మంచిది.... సానెవృత్తిలో ప్రవే సించింతర్వాత వూపిరాడకుండా రాత్రింబవళ్ళూ సంపాయించినదే సరి అయిన సానె. యీమాట గట్టిగా జ్ఞాపకంవుంచుకో మోహినీ నీకే చెప్పేది...'

'మోహినీ! నేను ఒక్కమాట అడగాల్లనుకున్నాను నిన్ను'

'అడుగుబావా! నీకు అడ్డమేమిటి.' అంది మోహిని.

'ఆ అయిదువందల్లో నాకు యిచ్చేదేమో యిచ్చేస్తే రేపు నాకు చాలా అవసరము. మీరు వూరికే యిచ్చినట్లుగా వుంటుంది. మీరు నాకు చెప్పినట్లుగా అక్షరాలా చేసుకు వచ్చానుగదా!...'

'ప్రతిదీ మా అమ్మచేతి మీదుగా జరగటం నువ్వు చూస్తూనేవున్నావుకదా! మాయిష్టం యేవిషయంలోనూ లేదు అంతా దాని యిష్టమే. యేంఅమ్మా! లింగయ్యబావ అడిగిం దానికి యేంచెపుతావో చెప్పు.' అంది మోహిని తల్లితో.

'లింగయ్యా! అంత తొందర పడతావేం చూదాంలే.' అంది శాయివేణి.

'తొందరగా అవుసరమొకటి కంఠంమీదకు వచ్చింది శాయివేణి! లేకపోతే యిప్పుడే మిమ్ముల్ని అడిగే వాడిని కాదు. మీదగ్గర వుంటేయేం నాదగ్గరవుంటే యేం! అసలు నిన్ననే అడుగుదామని అనుకున్నాను. ఆ హడావిడిలో అడగట

యెందుకూ యెక్కడికి పోతుంది రేపు అడిగి తీసుకుందాంలే అని వూరుకున్నాను.'

'పోనీ అమ్మా! యిచ్చెయ్యరాదూ యెప్పుడైతే యేం యిచ్చేదానికి. అవసరమని బిగలాపడుతున్నాడుగా' అంది మోహిని.

'నీలవేణీ! అక్కగదిలో అద్దాల అల్మారా తీసిపై అరలో అయిదు రూపాయలనోటు వుంది తెచ్చి లింగయ్యకు యియ్యి.' అంది శాయివేణి బొడ్డులోవున్న తాళంచెవులగుత్తి నీలవేణికి యిస్తూ.

'శాయివేణీ! అయిదు రూపాయిలేమిటి?' అన్నాడు లింగయ్య.

'యెంత యిమ్మంటావేమిటి?' అంది డబ్బుకాడికి వచ్చేటప్పటికి మూతి విరుచుకుంటూ శాయివేణి

'వాటాయిస్తానన్నావుగా శాయివేణీ?'

'అయిదువందల రూపాయలు వుంటే అందులో నీకు వాటా యివ్వనా వేరేఅక్కర్లా! యింతా కష్టపడినందుకు అదీ మేమూ తిని చచ్చేదేముందీ! అమ్మో! వాటాయే. అదెక్కడ సబబు లింగయ్యా!'

'నువ్వేఅన్న మాటేగా శాయివేణీ?'

'పెద్దమనిషి మతివుండో మతిలేకో పనితొందరవల్ల గబాలున తొందరమీద ఒకవేళ అంటే అన్నానేమో అదేపట్టు కూర్చుంటే యెలా?'

'అన్న దేమిటో నీనోటిమీదుగా అన్నావ్ అంతా వాటాకు యిచ్చెయ్యాలిసిందే. ఇంకోదాన్లో నీయిష్ట ప్రకారం చూసు

కుందాం.'

'ఇంకో దాల్లో నీయిష్టప్రకారం చూసుకుందాంలే దీన్లో మట్టుకు యిలాతీసుకో యివ్వవే నీలవేణీ.'

'యిదుగో బాబా! అయిదురూపాయిలూ'

'నాకేం అక్కర లేదు అవ్వికూడా మీరే వుంచుకోండి.'

'కబుర్లు మట్టుకు చల్ల చల్లగా చెప్తుతావ్ డబ్బుదగ్గరకి వచ్చేటప్పటికి ఆమంచితనం యేమయిపోతుంది లింగయ్యా! నువ్వు చేసిన కష్టమేమిటో చెప్పుబాబూ! నువ్వుకోరినంతయిస్తాము.'

'మీరేం చెయ్యమంటే నేను అదిచేశాను. మీరు చెయ్యమన్నదేదో చేశాను. అంతకంటే నన్ను యేంచెయ్యమన్నావ్?'

'వళ్ళు తెలియకుండావున్న వాడిని బండి తెచ్చి, బండిలో పడుకో బెట్టి యింటికితీసుకువెళ్ళి వప్పచెప్పి వచ్చినందుకు నీకు వాటాకావాలీ? వాటాయివ్వమని అడుగటానికి నీకు నోరెట్లా వచ్చింది లింగయ్యా! నువ్వు యిటువంటివాడివని యెప్పుడూ అనుకోలేదునేను. లేకపోతే నిన్ను పిలవనే పిలవను. యే అంజయ్యనో, పిలిచేదాన్ని...'

'నువ్వు అవుసరం తీరేదాకా అవుసరంతీరే మాటలు మాట్లాడి అవుసరం తీరింతర్వాత యిలామాట్లాడతావని యెన్నడూ అనుకోలేదు- యిలా అవస్తపెడతావు డబ్బుయిచ్చేటప్పుడు తిప్పలు పెడతావనుకుంటే నేను అసలువచ్చే వాడినేకాను. నువ్వుయిలా చివరికి పేచీలుపెడుతావేమో అని అనుమానంవల్ల నేముందుగానే అడిగాను-'

'నువ్వురాకపోతే మాకు పని ఆగిపోయేది అనుకుంటున్నావేమో, నువ్వురాకపోతే నీబాబులాంటి వాణ్ణి ఇంకోణ్ణి పెట్టి

చేయిస్తాను. యిటువంటి వాటికేం నేను జంకేదాన్ని కాను నేను యేమనుకున్నావో.'

'అసలు నేను పొరపాటుచేశాను ముందుగా చేతులో వేసుకుంటే పోయేది.'

'ఊఁ... వేసుకోకపోయావ్!'

'యింతేనా యింకేమన్నా చెడిపోతానా? యింతటితో నేను చెడిపోయేదిలేదు. మీరు బాగుపడేదిలేదు'

'లింగయ్యా మర్యాదాగా మాట్లాడు! యేమనుకుంటున్నావో. యిష్టమయితే అయిదు రూపాయిలకంటే అరగానీ యెక్కువ యివ్వను తీసుకోలేదా ఆ అయిదు రూపాయిలూ కూడా మాకే వుంటాయి. శీఘ్రింమాయింట్లోంచి వెళ్ళిపో అంతే గాని యెక్కువ తక్కువ మాటలు మాట్లాడావాంటే యీ మర్యాదాకాస్తా చెడుతుంది. మాటలునీకే వచ్చుననుకుంటున్నావేమో.'

'లేకపోతే యేమిటి యిస్తానన్నదానికి కూడా లేదని నోట్లో మట్టి కొట్టుకుంటే చేసేదేమిటి అదికూడా మీరే తీసుకుని బాగుపడండి నాకేంముష్టేస్తావా అయిదురూపాయిలు...'

'నువ్వు కొట్టుకో నోట్లోమట్టినీ వాళ్ళకుకొట్టు నోట్లోమట్టి యెక్కడా పుట్టకపోతే నోట్లోమట్టే పడుతుందేమో, భగవంతుడు నోట్లోమట్టెకొడతాడేమో చివరికి.'

'శాయివేణీ! పిచ్చివాగుళ్ళు వాగావంటే చెప్పుదెబ్బలు తింటావ్' అన్నాడు కళ్ళెఱ్ఱజేసి.

'మళ్ళా జూతీదెబ్బలు తింటావ్ నువ్వు.' అంది కంఠం చించుకుంటూ శాయివేణి.

'ఛీ...నీగుమ్మం త్రొక్కినవాడు యెవడుబాగుపడ్డాడు. వాడికళ్ళల్లో, వాడికళ్ళల్లో కారంజల్లి, లోకులకొంపలు తీసివేసు కున్న పాపిష్టిసొమ్ము యిదెన్నాళ్లు నిలుస్తుంది. నీ గుమ్మం త్రొక్కితే దరిద్రంకూడా జుట్టుకుంటుంది. యీరోజు మొదలు కొని నీ గుమ్మంతొక్కితే ఛీ...అను. అదీ యిదీ అంతా నువ్వే వేసుకో, బాగుపడు. నువ్వేమాత్రంజయంపొందు తావో నేనూచూస్తాను.' అంటూ యేమేమో అనుకుంటూ లింగయ్య దమ్మిడీ పుచ్చుకోకుండా వాటాకు సరిపడే సొమ్ము యివ్వలేదనే కోపంతో వెళ్ళిపోయాడు.

'అబ్బో! యీ గుంజన్న మాగుమ్మం త్రొక్కకపోతే మాకు దిగడింది. మాతనువులన్నీ యీ గుంజన్నతోనే వున్నాయి అనుకుంటున్నాడు. యీయనపోతే యీయనబాబు యింకోకడు రొట్టెముక్కలు యెగరేస్తే కుక్కలు బోలెడు వెంట పడతాయి యేమిటే తమాషాచూస్తారు పదండిలోపలకు.' అంటూ భడేలుమని తలుపులు వేసుకుని లోపలకు వెళ్ళి పోయింది శాయివేణి.



# 6

పాపము తనచేతనైనంతవరకు భర్తను చెడుప్రవర్తన నుండి మంచి మార్గంలో పెట్టాల్సిని వీలయిన సమయాల్లో యేమేమిటో చెప్పేదేగాని భర్త స్వేచ్ఛకు అడ్డుపోయేదికాదు పద్మ. భర్తవల్ల కలిగిన కష్టాలనూ, తన మనసుకి బాధపెడుతున్న విచారములనూ మణిని చూసుకొంటూ మరిచిపోతోంది పద్మ. యెప్పటికైనా మంచిరోజులు రాకపోతాయా అని ఓపిక పట్టి మణిని కాపాడుకుంటూ కాలంగడుపుతోంది. ప్రతి రోజూ రాత్రి భోజనంవేళకు వచ్చి భోంచేసి వెళ్ళి యేఅర్ధరాత్రికో లేదా మరునాడు మళ్ళా భోజనం వేళకో యిల్లుచేరుకుంటూ వుండేవాడు మాధవరావు. అప్పటికి నాలుగయిదు రోజులనుంచీ మణికి జబ్బుగా వుంటోంది. మందులు వగైరా యింట్లో పని చేసేమనిషిచేతే తెప్పించుకుంటూ తంటాలుపడుతోంది పద్మ. మందులు వగైరా తాను తెచ్చి శ్రద్ధగా కొడుకును చూసుకోవటంలేదు సరికదా ఒక్కసారి కూడా మణికి యెలావుంది అన్నమాటే మాధవరావు నోటివెంట రాలేదు. అందుకుకూడా పద్మ నోరుయెత్తి భర్తను యేమీ అనలేదు. కళ్ళల్లో పెట్టుకుని మణిని కాపాడుకుంటోంది. ఆనాడు మణికి జబ్బుయెక్కువగావుంది. సాయంత్రం పనిచేసేమనిషి చేత కబురుపంపగా డాక్టరు వచ్చిచూసి మందు పంపించాడు. మందుతోపాటు జాగ్రత్తగా చూస్తూవుండమని కబురు పంపాడు. మందిచ్చి ప్రాణాలన్నీ మణిమీదే పెట్టుకుని రెప్పవాల్చకుండా మణివంక చూస్తూ మంచంకోడు దగ్గర కూర్చుంది పద్మ. మామూలుగా

పకాంలోంచి యింటికి భోజనానికై వచ్చాడు మాధవరావు. భర్తరాగానే ఆలస్యమైయిందని తిరిగి వెళ్ళిపోతాడేమోనని వెంటనే భోజనంపెట్టింది. మాధవరావు భోజనం అయిపోయింది మళ్ళావచ్చి మణి పక్కలోకూర్చుంది. నాన్నా! మణీ! యిటు చూడుతండ్రీ! పాలుత్రాగుతావా! అంటూ పలకరిస్తూ పాలు త్రాగించింది. కొడుకు అవస్థ యేమాత్రం విచారించకుండా యథా ప్రకారంగా తమలపాకులు నములుతూ మూసేడు బ్యాటిస్తైటు చేతులోపెట్టుకుని మోహిని యింటికి ప్రయాణమయి వెళ్ళబోతున్నాడు.

'యెక్కడికి వెళ్తున్నారు.?' అందిపద్మ.

'యెక్కడికెడితే నీకెందుకూ?'

'యివాళికి మటుకు యెక్కడికీ వెళ్ళకండి. కాస్త నాయందు అనుగ్రహించి యింట్లోవుండండి.'

'యేంవిశేషం.?'

'మణికి నాలుగయిదు రోజులునుంచీ జ్వరంగావుందికాదు టండీ'

'ఊఁ... అయితే నన్ను వుండి యేంచెయ్యమంటావ్?'

'మీరేంచెయ్యక్కర్లేదు యింట్లోవుంటేచాలు.'

'యెందుకూ విగ్రహ పుష్టికా!'

'నాన్నా! యెక్కడికి వెళుతున్నావ్? యింట్లోవుండవూ' అన్నాడు మణి హీనస్వరముతో.

'యీరాత్రి మటుకు యెక్కడికీ వెళ్ళకండీ యీనాస్వల్ప కోరిక నెఱవేర్చండి.' అంది దీనంగా పద్మ.

'వ్రారికే వుండమంటేకాదు కారణంచెప్పు. లేకపోతే అవతల నాకు చాలాపనివుంది వెళ్ళిపోవాలి.'

'మణికి యివాళ ప్రొద్దుటనుంచీ జబ్బు యెక్కువగావుంది.'

'డాక్టర్ని పిలిపించి చూపించుకో.'

'పనిచేసేదానిచేత కబురుపంపితే పొద్దుటా, సాయంత్రం కూడావచ్చిచూసి వాడిగుండెలూ అవీ పరీక్షచేసి మందులు పంపారు...'

'యింకేంమంచిపనిచేశావు ఆమందు వేస్తూవుండు నేవుండి మటుకు చేసేదేమిటి.'

'యివాళ సాయంత్రంనుంచి మగతగావున్నాడు. మణి సంగతి చూస్తే నాకు చాలా విచారంగావుంది. యేమీ తోచ టంలేదు. నాకు భయంగావుంది.'

'యెందుకూ భయం?!'

'మగతగావున్నాడు యేసమయాన డాక్టరుగారిని తీసుకు రావలసి వస్తుందో ఆమాత్రం మీరు కూడా యింట్లో లేకపోతే ఆడదాన్ని, ఒంటరిదాన్ని యేంచెయ్యగలను చెప్పండి? వాడి స్థితీ, వాడివైఖరీ యిదివరకుకీ, యిప్పటికీ బేధంకనిపిస్తోంది. యివాళ క్రొత్తసంగతి మగతబయల్దేరింది. వాడిగతి యేలా జరగ నున్నదో అని నిజంగా నాగుండెలు బ్రద్దలయిపోతున్నాయి. నాకు మనసులో మనసులేదు. మతిభ్రమకలుగుతోంది. యి న్నాళ్ళనుంచీ వాణ్ణే కళ్ళముందు పెట్టుకుని నాకష్టాలు మరిచి పోతున్నాను. అమ్మా! అమ్మా! అంటూ నీడలాగా నన్ను అంటివుండి నేను యెప్పుడైనా సంసార పరిస్థితులు తలుచు కుంటూ విచారపడుతూవుంటే అమ్మా! నువ్వు యేడవకు

నువ్వు యేడిస్తే నాకుకూడా యేడుపువస్తోంది. అని తన చొక్కా పెట్టి నాకళ్ళనీళ్ళు తుడిచి నన్ను ఓదారుస్తూవుండే వాడు బిడ్డ వారం రోజులునుంచి మూసిన కన్నెరగకుండా పాలతో నాలుక తడుపుకుంటూ మంచంమీద పడివుంటే నాకు ప్రాణాలు పోయినట్లుగావుంది. నాలోనేను వాడిని చూసి కంట తడిపెట్టని రోజు లేదు. నేను యేడ్వటంచూసి వాడెక్కడ యేడ్చిపోతాడో అని చాటుగా వెళ్ళి కళ్ళనీళ్ళు కళ్ళప్రక్క కుంటున్నాను. మీకు వాడిసంగతి యే మాత్రమూ మనసులో లేదేమండీ? కడుపున పుట్టిన బిడ్డ వారం రోజులనుంచి పచ్చి లంఖణాలుచేస్తూ కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని వుంటే యింట్లో వుండి యీరాత్రికి వాడికి వుపచారం చెయ్యటానికి యింతకష్టంగా వుంది మీకు యిదెక్కడ అన్యాయమండీ?! మిమ్మల్ని రోజూ నేను యింట్లో వుండమని చెపుతున్నానా! యివాళ జాగ్రత్తగా చూస్తూవుండవలసింది అని డాక్టరుగారు కబురుపంపారు. అందుకు తగినట్లుగా మణి మగతగావున్నాడు. ఆమాటవిన్నప్ప టినుంచీ నామనసులో పిడుగుపడ్డట్లుగావుంది.' అంది పద్మ పవిటచెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

'అంత అవుసరమైతే కొంచెంసేపు వుండివస్తాలే' అంటూ వెళ్ళబోతున్నాడు.

'వెళ్ళకండి యీపూటకి. మగత యెక్కువవుతున్నట్లుగా వుంది డాక్టరుగారిని పిలుచుకురావల్సివస్తుంది.' అంటూ ఏడ్వ టంమొదలుపెట్టింది పద్మ.

'ఛీ...ఛీ...నోరుముయ్! అవకతవక వాగుళ్ళు వాగక, ఏడుస్తావెందుకు కొంపమునిగినట్లు డాక్టరుగారి కోసము మాట

మాటకీ మనంపరిగె త్తటమేకాని డాక్టరు మటుకు యేంచేస్తా డేమిటి? డాక్టరు యిచ్చిన మందువేసేసరి దానికి యింకా తిరిగే మిటి! రాత్రి పూట నిద్రపోయే సమయం కాబట్టి నిద్రపోతు న్నాడు. అంతమాత్రాన గాబరాపడి గంతులేస్తే ఏమనుపులు మొదలు పెడితే ఏంలాభం? మందువేసెయ్యి యేంఫరవాలేదు.'

'మణి స్థితిచూస్తే నాకు యేడుపు ఆగటంలేదు. అయి నా యీరాత్రిమటుకు యింట్లోవుండండి. రేపటినుంచి మిమ్మల్ని యింట్లో వుండమని అడగాఅడగను అడిగినా మీరు వుండవద్దు యివాల్టికి నామాటవినండి.'

'మారేంభయంలేదు వాడికి బంగారుతండ్రిలాగా పడుకుని నిద్రపోతూంటే మగతంటావేమిటి పిచ్చి వాగుడు వాగక వాడు చిరంజీవి యిప్పుడే వస్తాను చూస్తూవుండు...'

'అయ్యో, నామణి నాకు దక్కుతాడో, దక్కడో అని నాగుండెలు పగిలిపోతున్నాయి! మీకు యేమాత్రం విచారం లేదేమండీ?! యీరాత్రి వాడిగతి యేంకానున్నదోగదా!' అంటూ కళ్ళనీళ్ళు కారుస్తూ పద్మ ఏమేమో చెప్పబోతూంటే విని పించుకోకుండా వేశ్యావ్యామోహంలోపడి మోహిని యిం టికి వెళ్ళబోతున్నాడు. త్రోవకి అడ్డంగా నుంచుని

'మణిసంగతి మీమనసుకి యేమాత్రం పట్టదేమండీ! మీరు వెళ్ళిపోతే నేను ఒక్కదాన్నే వుండలేను. వాడి సంగతి చూస్తే యేమాత్రం బావుండలేదు. తెల్లవారేటప్పటికి వాడు మనకు దక్కుతాడో లేదో అన్నట్లుగా వుంది వెళ్ళకండి...'

'యిప్పటికే చాలాసేపు వుంచావు నన్ను యింట్లో, నేను వెళ్ళక తప్పదు నన్నుపోనీ.'

'మిమ్మల్ని బ్రతిమాలుకుంటున్నాను మీ మనసు యింత కఠినంగా మారిందేమండీ.'

'త్రోవలో అడ్డంనుంచుంటే ఆ మాత్రం వెళ్ళలేనా నీ అభిప్రాయం ఓహో హో, మొండితనంగా వుండే నీ వ్యవహారమంతా లే ముందు త్రోవకి అడ్డం...ఊ...'

'యీరాత్రి మటుకేగా మిమ్మల్ని యింట్లో వుండమని కోరింది.'

'ముందు త్రోవకి అడ్డంలేచి మాట్లాడు...అడ్డం లేవక పోయావాంటే యిప్పుడు నిన్ను చంపేస్తాను యేమనుకుంటు న్నావో...యింత మొండిముండ వయిపోయావేమిటి మరీను. నీతో అసలు మాట్లాడుతున్నందుకా నెత్తినెక్కి త్రొక్కుతు న్నావ్?! నా అలుసు బాగా కనిపెట్టావ్! నేను అసలు యీ యింట్లో ఒక్క క్షణం వుండను వెళ్ళిపోవాలి నిమిషాలమీద లే ముందు త్రోవలో...'

'మీరు యెన్నన్నా పడతాను నన్నుగురించి వుండవద్దు పసిబిడ్డ వాడినిగురించి వుండండి. పసివాడు భగవంతునితో సమానంగదా! వాడియందు మీకు కోపమెందుకూ...'

'నువ్వు తప్పుకుంటావా అవతలకు యీడ్చిపారెయ్యనా?!'

'నేను ఒక్కదాన్ని వుండి యేంచెయ్యగలనండీ.'

'యింత మొండిముండవి నిన్ను కత్తికోకంఠ కోసి గ్రద్దల కేసినా పాపంలేదు. ఛీ...యీ ముదనష్టం మేళాం అంతా నాపాలపడింది.'

అంటూ త్రోవలో అడ్డంగానుంచున్న పద్మ చెయ్యి పట్టుకుని బలం కొద్దీ యివతలకు గుంజాడు. యెదురుగావున్న

గోడమీదకు అకోపంమీద ఒళ్ళుతెలియక ఒక్క త్రోపు త్రోశాడు. ఆత్రోపుతో పద్మవెళ్ళి గోడమీద పడింది. మాధవరావు గబ, గబా వెళ్ళిపోయాడు. గోడమీదపడ్డ పద్మకు తలకాయపగిలినంత దెబ్బ తగిలి తలమీద బొప్పికట్టింది. కుడిచేతిని వున్న గాజులు అన్నీచిటికి ముక్కలయిపోయాయి చిటికినగాజుముక్కలు కొన్ని చేతిలో గుచ్చుకోవటంచేత చెయ్యి రక్తమయమయింది. రెండోచేతి గాజులు మాత్రం రెండు మూడు చిట్లిపోయాయి. మాధవరావు వెళ్ళిన కొద్దిసేపటికి మణికి వున్నట్లేవుండి ఆయాసం ప్రారంభించింది. నోటిమాట కూడా లేకుండాపోయింది. యేంచెయ్యటానికీ తోచక కాళ్ళ మీద పడుకోబెట్టుకుని డాక్టరుగారిచ్చిన మందు పోసింది పద్మ మందు లోపలికి దిగలేదు. అయిదు నిమిషాలు ఆలాగే ఆయాసంతో బాధపడి తల్లికాళ్ళమీదే ప్రాణాలు ఒదిలి పెట్టాడు మణి. యెదురొమ్ములు బాదుకుంటూ మణికోసమై వలవల యేడ్చింది పద్మ. పద్మను ఓదార్చువారు ఒక్కరైననూ లేర క్కడ. పద్మను ఓదార్చు మణి పాదాలపైనే మాయమయి పోయాడు. పద్మ దుఃఖానికి అంతులేదు: పుత్రశోకంవల్ల నరాలు తరుక్కుపోతున్నాయి. మణిని చేతులలో పెట్టుకుని ముద్దాడుతూ, యెదురొమ్ములకు హత్తుకుంటూ బిడ్డను చూసుకుంటూ యేడ్చి, మణి శవం మంచంపైన పడుకోబెట్టె అప్పటికి షుమారు అరగంటలోపలవెళ్ళిన భర్తజాడ కినిపిస్తుందేమోనని వీధి తలుపు తీసి చూసిందిపద్మ, అప్పుడే ఒక మిత్రునితో మాట్లాడి వెళుతున్నాడు మాధవరావు. భర్తకట్టుకుని వెళ్ళిన తెల్లటి మల్లెపువ్వుల్లాంటి దుస్తులూ, అనడకని బట్టి తనభర్తయే

అయివుంటాడనుకుని పిలుచుకుని రావటానికై వీధి తలుపుదగ్గర గావేసి బయలుదేరింది పద్మ. మాధవరావు కామాంధకారు డయి కన్నూమిన్నూ గానక రాజవీధి వెంటపడిపోతున్నాడు సానెవాడకు. మాధవరావు వెనకాల కొద్ది దూరంలో పద్మ, భర్త అవునాకాదా అనే అనుమానంతో వెళుతోంది. ముందు మాధవరావూ, వెనకాల పద్మా కొద్ది దూరంలో ఒకరి వెనకాల ఒకరు వెళుతున్నారు.

# 7

మాధవరావు సందులు సందులుగుండా పోతుంటూ, కంటికి కనపడుతున్నంతవరకు భర్తను వదలకుండా వెన్నాడుతూ పోయింది పద్మ. భర్త కనిపించకుండా పోయేటప్పటికి యేంచెయ్యటానికీ తోచలేదు పద్మకి. అది అర్ధరాత్రి సమయం! యెక్కడా నరసంచారం లేదు. పిశాచములు విహరించే వేళ. బిక్కుబిక్కుమంటూ ఒక్కతే వీధులవెంట బయలుదేరింది. మణి చనిపోయినందువలన మతి చెదిరినట్లయిపోయింది పద్మకి. పిచ్చి స్వరూపంపడింది. ఆ అర్ధరాత్రి సమయం భర్త యెక్కడ వుంటాడని వెతుకుతుంది పాపం! అగ్నిసాక్షిగా పెండ్లియాడిన భర్త వేశ్యాలోలుడయి పెట్టే అవస్థలకు తోడు కడుపునపుట్టిన బిడ్డ! అల్లారు ముద్దుగా పెంచుకున్న ముద్దులపట్టి మణి చనిపోవటంవల్ల పద్మకు ప్రపంచకం పూర్తి విరక్తి కలిగింది. భర్త నిష్ప్రయోజనమయి, భర్తచే నీచంగా చూడబడుతుంది. భర్త వేశ్యావ్యామోహముతో ఆవేశ్యల విషకౌగిలిలో చిక్కి వాళ్ళు యెలా ఆడిస్తే అలా ఆడుతూ, త్రాగుడు మొదలయిన దురభ్యాసములకు అలవాటుపడి. త్రాగివచ్చి పెట్టుచున్న కష్టములనుభవించుచూ, కాకివలెకలకాలము బ్రతికేకంటె భర్తమనస్సు పరాధీనమయినప్పుడు చచ్చినమేలు! ఇప్పటికైనా నా ఆజీవికి హాయి అనేదిసక్కస్తుంది. అది అప్రయత్నంగా ఆమెలోంచి యెవరో హితవుచెప్తున్నట్లుగా వినిపించింది. జీవితంపైన విరక్తిచేసుకుంది. తాను భర్తవల్ల అనుభవించిన కష్టాలను తలుచుకుంటూ వల, వల యేడ్చింది. మణీ! నాయనా!

రాత్రింబవళ్ళూ అమ్మా! అమ్మా! అంటూ నోరు కాయకాసే ట్లు పిలుస్తూ యెప్పుడూ నా వెంటనంటి వుండేవాడివి వీనాన్న దుర్వ్యసనములకు లోబడి నన్ను కష్ట పెడుతూ నాజీవితమును కష్టాలపాలు జేసినా, నిన్ను చూసుకుంటూ, నీ పోషణచేసు కుంటూ, నీజిలిబిలి ముద్దుపలుకులు ఆలకిస్తూ, కష్టాలను మరిచి పోయేదానిని! నిన్ను చూడగానే నామనసులో చింతలన్నీ చెల్లా చెదరయిపోయేవి! ఒక్క గానొక్క కొడుకువైనందుకు మొలను ఆ బంగారపు మామిడి పిందలూ, కాళ్లని గజ్జల కడియాలూ ఆ వుంగరాలు తిరిగిన అందమైన నల్లని జుట్టూ, పచ్చటి దేహ చ్ఛాయా గోపాల కృష్ణుడులాగా నాముందు చిందులు త్రొక్కు తూ ఆడుకుంటూ ంటే నీ అందచందాలకీ, నీ వచ్చీ రాని మాట లకీ, నీ తేజస్సాయపు సౌందర్యానికీ, యెంతో మురిసి పోతూ వుం డేదాన్ని. అమ్మ కనపడకపోతే ఒక్క క్షణమయినా వుండలేవే, అటువంటి ప్రేమ విశ్వాసాలు యేమయిపోయినాయి నాయనా! చిన్నతనంనుంచి చంకదింపకుండా గారాబంగా పెంచుకున్నందుకు అమ్మని యింత అన్యాయం చేసి పోయావా? చేసుకున్న భర్తా అలా అయిపోయాడు! కడుపున పుట్టిన బిడ్డవి నువ్వేనాకు ఆదా రమని నీతోనే వుంది ప్రపంచకం అని యెంతో ఆశ పెట్టుకున్నాను. యెన్నో కోరికలు పెంచుకున్నాను యింతలో యిలా నాఆశలన్నీ నిరాశలుచేసి నాకడుపున చిచ్చు పెట్టి పోతావని యెన్నడూ కల లోనైనా అనుకోలేదు. నీస్వరూపాన్ని, నీముద్దు పలుకుల్ని, నీ ఆటపాటల్ని నేను మరచి పోగలనా? తండ్రీ! కళ్ళముందు గం తులేస్తూ అమ్మా, అమ్మా! అంటూ ఆడుకుంటూ వుండేవాడివి ఎంతలో మాయమయి పోయావు? నాకళ్ళముందు మెరుపు మెరి

పించి పోయావు. అయినా యిదంతా నామతి భ్రిమగాని పాప పుణ్యాలు యెరగని పసి పూవవి నిన్ను అనవలసిన పనిలేదు. భగవంతుడు చేసినదానికి నువ్వేం చేయగలవు?! దైవసంకల్ప మును నీవుమాత్రము తప్పించగలవా! నిన్ను విడిచి నేను క్షణ కాల ముండగలనా? వేశ్యావ్యామోహాములో చిక్కిన మీతండ్రి వలన బాధలుమటుకు నేను యెంతకాలం భరించనూ? యిప్పటికి కష్టాలు పడి పడి నావళ్ళు కాయలుకాసి పోయింది. అని యేమే మో అనుకుంటూవచ్చి వచ్చి గోదావరి ఒడ్డుకు చేరుకుంది. యిహాపడలేను - పడను భర్తమనసు పరాధీనమయినప్పుడు యే స్త్రీ మాత్రం యెంతకాలం భరించగలదు? యెప్పటికైనా మంచి రోజులు రాకపోతాయా కాలచక్రం ఒక విధంగానే తిరుగుతూ వుంటుందా నాభాగ్యచక్రం సక్రమంగా తిరిగేరోజులు వస్తాయేమో అని యెంతో ఓపిక పట్టాను. యిక నాజీవితంలో రోజు గడచిన కొలదీ కష్టాలే గుంపుగూడి వస్తున్నాయి. సౌఖ్యం అనేది ఆనం దం అనేది మచ్చుకైనా కనపడటంలేదు. భర్తచే విసర్జింపబడిన భార్య బ్రతుకు యేం బ్రతుకు- త్రాచుపాము కాటుకైనా మందు వున్నదికాని వేశ్యకాటుకు మందులేదు కదా! యీ వేశ్యా సంప ర్కమువలన సంసారములు నిలువునా కూలి పోవుచున్నవి! కొం పలుతీయు దుంపలై నర రూప రాక్షసులై వెలసిన వేశ్యల విష కౌగిటిలో చిక్కి యెందరు భస్మమగుచున్నారు! భార్య ఆభరణ ములమ్మి వేశ్యల మొఖాన గుమ్మరించి చివరికి వూరు పేరులేక యెందరు నశించి పోవుచున్నారు! యెన్ని సంసారములు గంగలో కలియుచున్నవి! భర్తలు వేశ్యాలోలురయి పెట్టు బాధలు సహిం పజాలక యెందరు సోదరీమణులు ఆత్మ హత్యలకు పాల్పడు

చున్నారు! తల్లీ! భరతమాతా! నీవైననూ నీ పుత్రికలను రక్షింపవేమి? వేశ్యాపిశాచములను పారద్రోలునాడుగదా నీవు నిర్మలమైన కీర్తి లభియించుట. నాడుగదా నీగర్భము ధన్యమగుటా! అత్తవారింట కాలుపెట్టిననాటినుండీ యెన్నికష్టములు పడితినో యీ యమకూపములో యెంత బాధ అనుభవించితినో ప్రత్యక్ష దైవములగు సూర్యచంద్రాదులకే యెరుక. తల్లీ! భరతమాతా! కామాంధకారమున బడి కన్నూ మిన్నూ యెరుగక ప్రవర్తించుచున్న నా భర్తను యేనాటికైననూ మంచి మార్గమున బెట్టి రక్షింపుము. అదేనా ఆఖరి కోర్కె!. గోదావరి వంక చూస్తూ మణి లీలగా తనను పిలుస్తున్నట్లుగా భ్రాంతిపడింది. మణీ! నన్ను పిలుస్తున్నావా?! యిదుగో వస్తున్నాను... నేనూ నీదగ్గరకే వస్తున్నాను! నేను నిన్ను విడిచి ఒక్క నిమిషం వుండగలనా పిచ్చితండ్రీ!...వస్తున్నాను...ఆగు...మణీ! నాబంగారుగనీ! నా పసిడికొండా! నా రత్నాల రాసీ! నా ముద్దుల మూటా! నా వరాలతండ్రీ! నీవు లేని ప్రపంచకం నాకెందుకు? ఆగు...మణీ ఆగు...... పాఠకమహాశయా! పద్మనీ దృష్టికి దూరమయినది. పద్మ సంగతి పరికింతువుగాక!...



8

తలుపు కొట్టుచున్న మోత విని మోహిని.
' వచ్చే... వచ్చే... ఎవరువాడు...?'
" తలుపు తియ్యి మోహినీ... తలుపు తియ్యి "
" ఎవరు ? "
" నేనే మాధవరావుని."

" ఓహోమీరా" అంటూ తలుపు తీసింది మోహిని. మాధవరావు లోపలకు వెళ్ళాడు. గదిలోకి వెళ్ళాడు మామూలుగా సరాసరి. మాధవరావు రాక చూసి యివాళ డబ్బు తీసుకు వచ్చాడనుకుంది మోహిని. గదిలో పందిరిమంచం యెక్కి కూర్చున్నాడు. పందిరిమంచం పరుపుపైన వేసిన చాకలిమడత దుప్పటి నలిగి పోయింది నలిగిపోయిన దుప్పటిపైన నలిగిపోయిన మల్లెపూలూ, వాడిపోయిన గులాబీ పువ్వుల రేకులూ నలిబిలై పడివున్నాయి. నేను రాకముందు యెవరైనా వచ్చి వెళ్ళారు కాబోలు మోహిని దగ్గరకు అని అనుమానించాడు మాధవరావు.

" యేమిటీ ఆలోచిస్తున్నారు?" అంది మోహిని.

" యివాళ మావాడికి జబ్బుగావుంది."

" వారం రోజుల క్రిందటే జబ్బుగా వుందని చెప్పేరే మీరు."

" అవును యివాళ కొంచం ముదురుగావుంది "

" అలాగా పాపం."

“ అందుకని యివాళ నామనసు సరిగా లేదు. అగ్గిపెట్టి పట్రా?”

“ తలగడా క్రింద వుంది తీసుకోండి” అంది పొరపాటున మోహిని. తలవైపు తలగడా తీశాడు. ఆతలగడా క్రింద ఒక మనీఫర్సూ, దొరాదొరసానీ ముద్దు పెట్టుకుంటున్న సిల్కు చేతిరుమాలా, వెండిసిగరెట్ల పెట్టీ యీమూడూ మాధవరావు కంట పడ్డాయి.

“ యివన్నీ యెవరివి మోహినీ?” అన్నాడు వెండి సిగరెట్ల పెట్టెపైన పేరు చదువుతూ, అవన్నీ మాధవరావు కంట పడగానే వళ్ళు ఝల్లు మంది మోహినికి. యెవరివని చెప్పనా అని ఆలోచిస్తోంది మోహిని.

“ ................”

“ మోహినీ! యీ ఫర్సు యివ్వీ యెవరివి?”

“ మా బంధువులవే లెండి” అంది. చప్పున నోటికి వచ్చినట్లుగా మోహిని తడబడుతూ

“ మీ బంధువులవి యిక్కడికెందుకు వచ్చాయ్?”

“ నాచేతికి యిస్తే రాత్రి నేను అక్కడ పెట్టాను.” అని తాత్కాలికంగా అబద్ధం ఆడి తప్పించుకుంది. మోహిని తడబడుతూ చెబుతూన్న బెదురు మాటలవలననే నిజం యెంతవరకో గ్రహించాడు మాధవరావు. కాని యేమనగలడూ వున్న సంగతి గ్రహించమని మాట్లాడకుండా వూరుకున్నాడు గంభీరంగా. మాధవరావు మనసుకి యేదో అనుమానం కలిగిందని మోహిని గ్రహించింది. సిగ్గుచేత తనలో తాను నొచ్చుకుంది.

“ డబ్బు యివాళన్నా తీసుకువచ్చారా?” అందిమోహిని

"శతవిధాల తంటాలు పడ్డాను కాని యివాళ డబ్బు అందలేదు.

"యివాళకూడా సున్నా అన్న మాటే?" అంది మోహిని.

"పోనీ దాని చేతి గాజులన్నా ... దూద్దామా అనుకున్నాను. అది మణికి జబ్బుగావుందని యేడుస్తూ కూర్చుంది. అంచేత వీలుపడక పోయింది."

"సరే అయితే బయటికి పదండి. యిప్పుడే మా అమ్మ నా మీదా, మీమీదా మిట్టిపడి కాస్త కళ్ళు మూసింది. లేచిందంటే మాటదక్కదు యెందుకొచ్చింది వెళ్ళిపోండి".

"మోహినీ! నువ్వుకూడా అలా మాట్లాడితే యెలా?"

"నన్నేం చెయ్యమంటారు చెప్పండి?"

"మంచి చెడ్డలు నువ్వుమటుకు యోచించక్కర్లేదా?"

"మీరు యిలా అంటారు. మాఅమ్మ డబ్బు నాకు తెచ్చి యివ్వందే అసలు ఆయనతో మాట్లాడనే వద్దు అంటూంది మీయిద్దరి మధ్యా అడకత్తెరలో పోక చెక్కలాగా నేను నలిగి చస్తున్నాను."

"రేపు తప్పకుండా యేదో విధంగా తెచ్చి యిస్తానుగా డబ్బు. నామాట నమ్ము మోహినీ"

"ఆమాట దాంతో చెప్పండి"

"ముసల్ది అసలు వినదు. యేవన్నా వింటే నువ్వే"

"నేను ఖర్మం చాలక మాట జారానంటే నన్ను చంపుతుంది మాఅమ్మ నాకెందుకు తెచ్చిపెడతారు. మీయిష్టం దాని యిష్టం"

వీళ్ళ యిద్దరి సంభాషణా వింటూ సావిట్లో కళ్ళు మూసుకుని పడుకున్న శాయివేణి గబ, గబా లేచి వచ్చింది. గది తలుపు కొట్టి

"అమ్మాయ్! మోహినీ!"

"యేం అమ్మా?"

"మాధవరావు బాబుగారు వచ్చారా యేమిటి?"

"వచ్చారమ్మా" అంటూ గది తలుపులు తీసింది మోహిని.

"యెలా వచ్చారే నేను సావిట్లోనే పడుకున్నానుగా. యే దోవని వచ్చారు బాబూ!"

"వీధి తోవనే వచ్చాను శాయివేణీ?"

"అలాగాండీ తలుపు యెవరు తీశారూ?"

"మోహినే తీసింది."

"యివాళన్నా పైకం యిప్పిస్తారా?"

"యివాళ డబ్బు కోసమే యెంతో ప్రయత్నంచేశాను"

"యింతకి సంగతి చెప్పండి మీరు ప్రయత్నాలు యెప్పుడూ చేస్తూనే వుంటారు. మీ ప్రయత్నాలతో మాకేం అవుసరం మా డబ్బు మాకు చేతిలో పడటం కావాలి కాని."

"అందలేదు. ఒకటి రెండు రోజులలో తప్ప కుండా తెచ్చి యిస్తాను శాయివేణీ"

"యిప్పటికి యెన్ని వాయిదాలు అయినాయండీ"

"ఒకొక్కప్పుడు చేతిలో వుంటుంది ఒకొక్కప్పుడు వుండదు. అది ప్రపంచక సహజమేగా శాయివేణీ"

"చేతిలో డబ్బు వున్నప్పుడే మా సుమ్మం తొక్కండీ.

డబ్బు లేనినాడు యింట్లోనే కూర్చుంటే ఎంతగా చాలూ వుండవు విశా ప్రాణానికి హాయి మా ప్రాణానికి హాయి. చూస్తాను తమాషా నెల రోజులనుంచి యిదుగో రేపు తెస్తాను, యిదుగో యెల్లుండి తెస్తాను అని మురిపించటంతోనే సరిపోతోంది కాని, కానీ డబ్బు మాకిచ్చావా నీ ప్రమాణ పూర్తిగా చెప్పు" అంది ఝుమాయించి

"శాయివేణీ! వున్న రోజుల్లో యెలా డబ్బు యిచ్చేనో నీచేత్తో నువ్వే పుచ్చుకొన్నావుగా నీకు తెలియదూ?"

"యిచ్చాను యిచ్చానంటావు నీకంటే యెక్కువగా యిచ్చినవాళ్ళే వున్నారు. మాకేం వూరికే యిచ్చావా?"

"వూరికే యెవరిస్తారు శాయివేణీ".

"మరి యింకేం పెద్ద మెప్పుగా చెప్పటానికెందుకూ"

"ఒకొక్కప్పుడు రోజులు తారుమారవుతాయి. అంత మాత్రంతో తొందరపడితే యెలా శాయివేణీ, కొన్నాళ్ళు వెన్నెలా, కొన్నాళ్ళు చీకటీ"

"యీ తారుమార్లు మాదగ్గర పనికిరావు. అంతా అయింతర్వాత పశ్చాత్తాపపడే మెట్ట వేదాంతం కబుర్లు మాదగ్గర చెప్పకు. డబ్బువుంటే యింట్లో కాలు పెట్టడం లేకపోతే బైటికి వెళ్ళటం రెండే మాటలు యెందుకొచ్చిన సోది".

"యిప్పుడు నాదగ్గర డబ్బు లేదు. ఒకటి రెండు రోజుల్లో యిస్తాను."

"డబ్బు అందినప్పుడే రండి వెళ్ళండి"

"డబ్బు వున్న రోజుల్లో యిట్లా మాట్లాడలేదేం. యిప్పుడింత ఖచ్చితంగా మాట్లాడుతున్నావ్? అప్పుడంతా

తేనెవ్రాసిన కత్తులలాగా ప్రవర్తించారే! నిజస్వభావాలు యిప్పుడు బైట పడ్డాయన్న మాట. యింత మోసపుచ్చారు నన్ను....''

'నీ జవాహిరీ అంతా వేసుకుందామని నిన్ను మోసం చేశాం సరేనా!'

'యింకా అందుకు సందేహమా! మా ఆవిడ మొదటి నుంచీ చెపుతూనేవుంది యివన్నీ డబ్బువున్నంతవరకే అని. ముండాకొళ్ళముచ్చట్లు నమ్మబోకండి-ఆవ్యామోహంలో పడి చెడి పోకండి-అని నన్ను బ్రతిమాలి చెప్పుతూవున్నా నేను నమ్మే వాడినికాదు. అది యెన్నయితే అనేదో అన్నీ అక్షరాలా నిజ మయాయి'

'మీ ఆవిడ్ని కావలించుకు ఏడ్వక రోజూ మాయిల్లు చుట్టూ తిరుగుతావెందుకూ?'

'అది చెప్పినట్లుగా వ్యామోహంవల్లనే.'

'డబ్బులేని వ్యామోహాలు గాలిమేడలు లాంటివి, యింట్లోకూర్చుని అనుకుని సంతోషించరాదూ?'

'మాకేం అంతఖర్మం మీరు అలా సంతోషిస్తారేమో. మీయిల్లు కాకపోతే యింకోయిల్లు'

'నువ్వు కాకపోతే నీతల్లో జేజిలాంటి వాడు యింకోడు. మాకు నీమాత్రం విటుడు దొరకడా! నీకు మా అమ్మ యిలాంటి సాని దొరకదా! యెందుకు అనవసరంమాటలు మాధవరావ్ వచ్చిన త్రోవని వెళ్ళిపో !'

'డబ్బువున్నంతవరకూ అడుగులికి మడుగులొత్తుతారూ కాస్త డబ్బు అందటం అటూ యిటూ అయితే యింతనిర్మొహ మాటంగా మాట్లాడతారూ. యిటువంటి నీచపుబుద్ధి కలవా

ళ్ళని యెప్పుడూ అనుకోలేదు. డబ్బే శాశ్వతమా!' యివా ళవుంటుంది రేపుపోతుంది.'

'నీకు డబ్బంటే లెఖ్ఖలేదు బాబూ! మాకు. అదే పది వేలు సగేనా!'

'యీ మొండి మాటలకేం'

'యెవరివీ మొండిమాటలు నీవా మావా? నువ్వు మొండి శిఖండివికాని మే మేం మొండి వాళ్ళంకాదు. మామాట లేంమొండిమాటలు కావు.'

'శాయివేణీ! యెవరితో మాట్లాడుతున్నావో జాగ్రత్త గా ఆలోచించుకొని మాట్లాడు శిఖండీ గిఖండీ అంటున్నావ్'

'యేం అనక యేంచేస్తావేమిటి నా తలకొట్టి మొల వేస్తావా? యిలా జడిస్తే చాలాకావచ్చు యిటువంటి వాళ్ళని చాలామందిని చూశాం'

'నీబోటివాళ్ళను నేనూచాలామందిని చూశాను దోడ్డి తోవను మనిషిని పంపించి వీధి తోవని మనిషిని రప్పించుకునే వాళ్ళని.'

."అవునోయ్ అది.మావృత్తి' అంది శాయివేణి, తల విసురుతూ.

'ఓయ్, గీయ్ అన్నావంటే పళ్ళురాల్తాయి జాగ్రత్త.'

'మాధవరావుగారూ! వ్యవహారం ముదురుతోంది గాని యండి యివాల్టికి మీరు వెళ్ళండి తరువాత మాటచూస్తాం' అంటూ మోహిని మాధవరావును వీధి వసారా వరకూ తీసుకు వచ్చింది.

'పళ్ళురాలగొట్టరా యేమాత్రం రాలగొడ్తావో చూదాం

అంటూ మాధవరావు మీదిమీదికి వెళ్ళింది శాయివేణి.

'అవక తవక వాగుళ్ళు వాగితే కొడతానా కొట్టిచూపి స్తానా.' అన్నాడు మాధవరావు కళ్ళెఱ్ఱజేస్తూ.

'ఛీ...ఛీ...ఆక్టేవాగక మా యింట్లోంచి బైటకి వెళ్ళు ముందు. యింక నుంచి మావాకిట్లోకి వచ్చిచూడు పేడకలాప్తీ కొడతాను. లోపలికి పదవే — యీ అష్టదరిద్రుని యెదుట నుంచుంటావెందుకూ, వీడి దరిద్రం మనకికూడా చుట్టుకుంటుంది. ఆ శమ్మాయన ఒచ్చేవేళ అయిందిపదా ... ' అంది గబ, గబా శాయివేణి.

'పోనీవే అమ్మా వెళ్ళిపొమ్మన్నాంగా ఆయనే వెళ్ళి పోతాడులే. యింకా ఆయనతో మనకి యెందుకు పోట్లాట.' అంది మోహిని తల్లికీ మాధవరావుకీ అడ్డంగా నుంచుని.

'యిద్దరూ యిద్దరేనే జగత్కిలాడీలు! యిందాకటినుంచి నోటికి వచ్చినట్లు యేంవాగావ్!' అని కాలిచెప్పు తీసి శాయివేణి మీదకు విసిరాడు ఆచెప్పు అడ్డంనుంచున్న మోహిని వీపుమీద తగిలింది ఫెళ్ళుమని. చెప్పుదెబ్బ తగలటంతోనే నీలవేణీ నీలవేణి దగ్గరకువచ్చిన ఒకానొకాయనా మోహినీ శాయివేణీ కలిసి మాధవరావును బయటకు తోసేసి తలుపులు బిగించుకు న్నారు. ఆతోపుకు మాధవరావు వీధి మెట్లమీద పడ్డాడు. 'చిల్లిగవ్వకు పనికిరాని చిత్తకార్తెమూకకు రోషాలూ, గర్వాలూ డాబుసర్లూ, కోతలూ, చూడబోతే ఓ...అంటూ ఏమిటో బాడించుకుంటూ శాయివేణి యింట్లోకి వెళ్ళిపోయింది. మోహినీ! నీలవేణీ యెవరిగదుల్లోకి వారు వెళ్ళారు.

—o—

# 9

ఆ పడటంతో మాధవరావుకి తలకాయ పగిలే అంత దెబ్బ తగిలింది. తల కాయనుండి చెంపలపైనుంచి చొక్కా వరకూ రక్తం కాల్వలయింది. దెబ్బ తగిలిన అయిదు నిమిషాలవరకూ తన్నుతానే యెరుగడు చేతులు రక్తం, తల రక్తం! చొక్కాఅంతా రక్తం! ఆ రక్తంతో మాధవరావుకు గాబరాకలిగింది.

'మోహినీ! మోహినీ! నీకెంతడబ్బు పెట్టాను. ఆఖరికి పెళ్ళాం మెళ్ళోనగలు కూడా వెనకా ముందూ ఆలోచించకుండా నీమాటలు నమ్మి దొంగిలించి తెచ్చి నీకు ఖర్చుపెట్టేనే! యింత విశ్వాసం లేకుండాపోయింది. చివరికి నా సొమ్ముతిని రొమ్ముగ్రుద్దినట్లుగా యింతపని చేస్తావని యెన్నడూ అనుకోలేదే. తేనె పూసిన కత్తివనీ! ప్రక్కలో మల్లెపూవులాంటి దానవు బల్లెంలాంటి దానవవుతావని కలలోకూడా అనుకోలేదు. మొదటి రోజులలో నాదగ్గరడబ్బు విరివిగా గలగలలాడుతున్న రోజులలో నాయందు నువ్వుచూపిన ప్రేమానురాగాలు మన జీవితాంతం వరకూ నిలిచిపోతాయని భ్రమపడి ప్రపంచకాన్నే మరిచిపోయాను. మా పద్మ చెప్పినట్లుగా ముణ్ణాళ్ళ ముచ్చటే అయింది! నీ ప్రేమ అంతా కపట ప్రేమ అనీ! డబ్బుతో కొనవలశిన ప్రేమ అనీ, తాత్కాలిక ధన సంపాదనకై విటుల పద్ద తారుచూ తప్పుచూ తళుకు బెళుకు లాడుతూ విటుల మనసులను వూగులాడించి వలలో వేసుకుని హారి ధన మాన ప్రాణాలు పీల్చిపిప్పిచేసి భాగ్యవంతులను నయితమూ సైరాగులనుచేసి బైటకు గెంటే యీ నీచపు వృత్తితో పొట్టపోసు

కొనుటకంటె మానమైనకుని బిరితకరాదా?! కపటప్రేమ చూపి మోసగించి డబ్బు సంపాదించటమే ప్రధానమనుకుంటున్నారు. యిలా సంపాదించిన డబ్బు యెంతకాలం నిలుస్తుంది! యేత్రా గుడికో అప్పుడే ఖర్చయిపోతుంది. ఒక వేళ నిలిచినా ఆడబ్బు తో మీరేం జయంపొందుతారు. యెంత డబ్బు సంపాదించినా మీ చివర రోజులలో చేతులలో చిల్లపీకైనా కానీ డబ్బు వుండక కట్ట గుడ్డా, తిన తిండీ కూడా సరిగా లేక కటకట పడ తారు. వయసులో శరీరంలో జీర్ణించిన రోగాలన్నీ బైటపడి నానా బాధలూ అనుభవిస్తారు. ఇందరి కొంపలు తీసి తమ కొంపలు నింపుకున్న ఫలితం, చేసిన పాపాలులకు ఫలితం అప్పుడు అనుభ విస్తారు. నాకు చివర చివర రోజులలో నీసంగతి తెలి సిందిగాని మొదటిలోనే యేమాత్రం నీప్రవర్తనలో అనుమానం కలిగినా నేను జాగ్రత్త పడేవాడినేమో! మోహినీ! నీ తల్లికీ నీ చెల్లెలికి నాయందు విశ్వాసం వుండకపోవటం ఒక విధంగా సహ జమే! నా పక్కన వుండి నా వల్ల సౌఖ్యాలు అనుభవించిన దానివి! యెప్పటి కప్పుడు కోసరి, కోసరి డబ్బు గుప్పెళ్ళతో పుచ్చుకున్న దానివి! యెప్పటి కప్పుడు మురిపెపు మాటలు చెపుతూ నీ జీవితాన్ని నా మీద ఆదార పడుచుకున్నట్లుగా. నన్ను నమ్మి నీ జీవితాన్ని నీ కష్టసుఖాలనూ నా అరిచేతులో పెట్టినట్లుగా, నీ యవ్వన సౌభాగ్యాన్ని నాకు ధార పోసినట్లుగా నమ్మించి నా సర్వస్వమూ పీల్చి నన్ను యింతలో తడి గుడ్డతో కంఠం కోశావు! నమ్మించి యింతపని చేశావు. యిందుకు ఫలితం అనుభవిస్తావు! నాకు నువ్వు చెప్పిన మాటలు తలుచుకుంటే ఒక విధంగా నవ్వొస్తోంది. ఒక విధంగా కోపమూ వస్తోంది.

యీరక్తాని చూస్తే యేడుపూ వస్తోంది. నాతోనే వుంది ప్రపం చకం అనేదానివి! నేలేంది ప్రపంచకమే లేదనేదానివి! యింతవరకు నీ యవ్వనాన్ని అనుభవించిన వారిలో నేను యెన్నో వాడినో గదా ? యిందుకు మిమ్మల్ని అనవలశిన పనేమిటి! మీవృత్తి యిది మీ జాతి లక్షణం యిది! అని యెన్నో సార్లు మీరే చెప్పారు. యిందులో మీ తప్పు యేమీ లేదు. యీ మాధవరావుదే తప్పు. మీరు యింతపని చేసినా యింకా మీగడపలో నేనుం చుని మాట్లాడుతున్నాను సిగ్గులేక. ఛీ...ఛీ... యింత విశ్వాస ఘాతకులు మీ ముఖం చూడ కూడదు. మీ గుమ్మం త్రొక్క కూడదు. పాతకం!—మహా పాతకం!... అంటూ మాధవరావు వేశ్యలపైన విరక్తి కలిగి యింటి త్రోవ పట్టాడు. త్రోవ వెంట కూడా యింకా యేమేమో తనలో తాను సణుక్కుంటూ పోతు న్నాడు. ఆ త్రోవనే మాధవరావుకి యెదురుగా వస్తున్నాడు లింగయ్య. లింగయ్య మోహిని యింట్లో ఆనాడు పోట్లాటజరిగిన ప్పటినుంచి యీ నాటి వరకు మళ్ళా మోహిని గుమ్మం త్రొక్క లేదు. మోహిని,శాయివేణి పేర్లు చెప్పితే పచ్చ గడ్డి లేకుండా భగ్గు మంటున్నాడు లింగయ్య. తెల్లటి బట్ట రక్తంతో తడసి వస్తున్న మాధవరావును చూసి గాబరా పడిపోయాడు లింగయ్య.

"మాధవరావుగారూ! యేమిటి రక్తం?!" అన్నాడు ఆశ్చర్యంగా.

"విష చురికలు వేశ్యలయిండ్లకు వెళ్ళినందుకు ఫలితం యిది" అన్నాడు మాధవరావు.

"అసలు జరిగిన సంగతేమిటి? బాబూ."

"లింగయ్యా! నాసంగతి నీకూ తెలుసునుగదా యీ

మధ్య కొంత కాలంనుంచి నీకూ వాళ్ళకు యేదో పోట్లాటలు వచ్చి వాళ్ళ యింటికి రావడం మానేశావుగాని అంత క్రితం వస్తున్న వాడి వేగదా! నేను వాళ్ళకి యెంతెంత డబ్బు యిస్తూ వుండేవాడనో నీకు తెలియదూ, నీవు యెరగవూ?

'మీరు వాళ్ళకు డబ్బు పెట్టినట్లుగా యెవరూ యింత వలకు పెట్టనే లేదు.'

'అంతమట్టుకు నీకు తెలుసుగదా! యిదివరకు పెట్టిందీ చేసిందీ అలావుంచు-సన్ను యీ మధ్య కొంతడబ్బు అడిగారు. యిస్తానన్నాను. ఆడబ్బుకై అనేక ప్రయత్నాలుచేశాను. అది అందలేదు. ఆడబ్బు యివ్వకుండా యెప్పటికప్పుడు యిదుగో అదుగో, అని జరుపు తున్నావు, యిలాజరిపితే మరెలా అంటూ యేమేమిటో నా మీద యెగరటం మొదలు పెట్టింది.'

'యెగురుతుంది లెండి మీమీద యేమిటి, యెంతెంత వారి మీదనైనా యెగురుతుంది.'

'అప్పటికీ చాలావరకు ఓపికపట్టి నిదానించాను లింగయ్యా'

'మీసంగతినాకు తెలియదా...'

'నేను వూరుకుంటున్నదే చాలుగదా అని నోటికిదుడుకు మాటలు మాట్లాడటం మొదలు పెట్టింది. అంతటితో నాకు కోపం ఆగలేదు. ప్రశ్నమాట చెప్పొద్దూ కాలిచెప్పుతీసి మీదకు విసిరాను'

'శాయివేశికి బాగా చెప్పుదెబ్బలు తగిలాయన్నమాట.'

'ఆ చెప్పు మోహినికి తగిలింది వెళ్ళి'

'దాని మంత్రాంగమే కాదండీ యిదంతా! మోహినీ యే సరిఅయింది అయితే యీతల్లి ముండని యింత వేశ్రేగ

నిస్తుండా అసలు నాటకం అంతా జరిగుతిలదే. అదినట్టి మాయల మరాఠీ ?'

'యదార్థమే లింగయ్యా! అమాటనేను యిప్పుడు నమ్మ గలిగాను.'

'మీకు యిప్పుడు అనుభవంలోకి వచ్చింది. తెల్లవారి లేస్తే వాళ్ళ యింట్లో తిరుగుతూ వుండేవాళ్ళం గనుక మాకంతా బాగా తెలుసును. అనేకం కళ్ళారా చూస్తూనే వుండేవాళ్ళం. చేతులారా చేస్తూవుండేవాళ్ళం. అసలు నాకూ వాళ్ళకూ చెడింది మీ విషయంలోనే కాదుటండీ...'

'నావల్ల నీకూ వాళ్ళకీ చెడిందా! యెందుకనీ?'

'ఒకరోజున రాత్రి నేనుమోహిని యింట్లోకి వచ్చేటప్పటికి శాయివేణి గదిగుమ్మం బైటనుంచుని చూస్తోంది. మీరు పందిరి మంచంపైన అటూ, యిటూ వున్న దోమతెరమధ్య కూర్చున్నారు. నీలవేణి మీ యెదురుగుండా తళుకు బెళుకులాడుతూ అభినయం పడుతోంది జావళీ పాడుతూ. మీకేదైనా త్రాగ బోశారో యేమిటో మీరు ఒళ్ళు తెలియన్నట్లుగావున్నారు. మీజేబూళ్ళోంచి వందరూపాయల నోట్లకట్ట కొట్టేస్తోంది మోహిని. సరిగ్గా అది నా కంటపడింది. నేను చూడటం కూడా చూసింది మోహిని. తరువాత నాదగ్గరకు వచ్చి లింగయ్యా మాధవరావుగారు వళ్ళు తెలియకుండా వున్నారు బండీలో పడుకోబెట్టి యింటిదగ్గర దిగడ్చి రమ్మన్నారు. చేసినపాపం చెప్పవద్దూ వాళ్ళు చెప్పినట్లుగానే మిమ్మల్ని బండీలో పడుకోబెట్టి యింటి దగ్గర దిగడ్చి యింట్లో పడుకోబెట్టి వచ్చిం తర్వాత నేనెలాగూ చూశానుగదా అనుకుని మాధవరావుగారిని

త్రాగబోసి ప్రక్క జేబులోవున్న అయిదు వందల రూపాయిలు కొట్టేశాము లింగయ్యా! అని పెద్ద తెలివిగల పనిచేసినట్లుగా చెప్పారు తల్లీ కూతుళ్ళూ.

‘లింగయ్యా! నాజేబూలో అయిదువందలూ మోహినీ వాళ్ళూ నన్ను త్రాగబోసి కాజేశారా? నీకుబాగా తెలుసునా?’

‘అవునండీ, నేను కళ్ళారా చూశానండీ మోహిని వంద రూపాయలనోట్లు తీస్తోంటే.’

‘లింగయ్యా! సొమ్ము ఒకచోటవుంటే, అనుమానం ఇంకోచోట వుంటుందికద్దా!’

‘ఆమాట వాస్తవం మాధవరావుగారూ! ఆయన సొమ్ము తింటూ అలా చెయ్యటం మంచిపని కాదనేటప్పటికి తల్లి కూతుళ్ళు నామీద విరుచుకుని పడ్డారు. అంతటితో మాటా, మాటా పెరిగి వాళ్ళగుమ్మం త్రొక్కటం మానేశాను.’

‘లింగయ్యా! ఆసొమ్ము వాళ్ళు తీశారని నేను నువ్వు చెప్పేదాకా అనుకోవటం లేదు. యెంతపనిచేశారూ! నాకు ఆశ్చర్యంగావుందే!...’

‘మోహినికి చెప్పుదెబ్బ తగిలిం తర్వాత యేమయిందీ?’

‘చెప్పుదెబ్బ తగిలిందనే కోపంచేత మోహినీ, దానితల్లీ, నీలవేణీ, నీలవేణిని వుంచుకున్నాయనా వచ్చి అందరూ తలో చెయ్యావేసి బైటకుతోసేశారునన్ను. అత్రోవుకి వచ్చి వీధి మెట్ల మీద పడ్డాను. నాపరాయి మొన తలకు గుచ్చుకుని రక్తం బొళ, బొళా కారింది. వాళ్ళగుమ్మంలో ఒక్క నిమిషం అడుగు మోపటానికి యిష్టంలేక వాళ్ళముఖం చూడటం పాతకం అనుకుని వచ్చేస్తున్నాను...’

'పాతకమా, మహాపాతకమా! యింటికి వెళ్ళగానే తలకు గుడ్డ చుట్టండి. వెళ్ళొస్తానుబాబూ.'

'పోయిరా లింగయ్యా! నాఖర్మానికి నువ్వేంచేస్తావు.' అన్నాడు మాధవరావు లింగయ్య వెళ్ళిపోయాడు. నాదగ్గర యింత సామ్మూర్తిని యెంత పనిచేశారు అని ఆశ్చర్యపోతూ యింటికి వెళ్ళాడు మాధవరావు.



# 10

పద్మా! పద్మా! అంటూ తలుపు కొట్టాడు మాధవరావు. తలుపుతీసేవుంది. తలుపుతీసివుంది యెందుచేత చెప్మా అనుకుంటూ యింట్లో ప్రవేశించాడు. తన రాకకోసమై తపించిపోతూ యింటికి రాగానే చంద్రబింబంలాంటి ముఖంతో కళ కళలాడుతూ యెదురుగావచ్చే పద్మ యింట్లో కనిపించలేదు. పద్మా! పద్మా! అంటూ నలుమూలలా వెతికాడు. పద్మ కనిపించలేదు. ఏదీ పద్మ అక్కడవుంటేగా? పచ్చగా బంగారవు ప్రతిమలాగావున్న మణి శవం మటుకు ప్రక్కమీద కనపడింది.

'నాన్నా! మణీ! అమ్మయేది తండ్రీ!' అన్నాడు మణి నిద్రపోతున్నాడనుకొని.

'........................'

'మణీ! మణీ! అమ్మయేది చిట్టిబాబూ?' అన్నాడు మణిని గడ్డంక్రింద చెయ్యిపెట్టి అటూ యిటూ కదుపుతూ. జవాబు చెప్పటానికి యేముందక్కడ? ప్రాణంపోయిన కట్టె. తండ్రి మనసుతిరిగి ముద్దులాడే నాటికి ప్రాణాలే వదిలిపెట్టాడు మణి. మణి మాట్లాడలేదని గాబరాతో నాలుగయిదు సార్లు అటూ, యిటూ కదిపి చూశాడు. అప్పుడు మణి చనిపోయాడనుకున్నాడు. మణి శవంమీదపడి ఘొల్లు మన్నాడు. మణి చనిపోవటం, పద్మ యింట్లో కనిపించకపోవటం, మాధవరావు హృదయంలో పిడుగుపడినట్లుగా అయింది. మణీ! నాదుర్ప్రవర్తనకు నీప్రాణాలు బలిగా యిచ్చావా! ప్రపంచకంలో సరిగా ఒక అడుగయినా మోపలేదేనువ్వు, యింతలోనీకు ఆయువు

మూడినదా? ముక్కు పచ్చలారని ముద్దు బిడ్డను నిన్ను మింగ టానికి అమృత్యుదేవతకు నోరెలావచ్చింది. ముద్దులు మూట గట్టు నీ జిలిబిలి పలుకులు విని ఆనందించే భాగ్యము నాకు కల్గ లేదుకదా? రాత్రి నేను యింటినుండి వెళుతున్నప్పుడు 'నాన్నా! యెక్కడికి వెళుతున్నావ్? యింట్లోవుండవూ?' అంటూ దీనంగా వేడుకున్నావు. వేశ్యా వ్యామోహంవల్ల నీ మాటలు నా చెవి కెక్కలేదు. నిన్ను చూడటం, నీ మాటలు వినటం నాకదే ఆఖరిసారి అయింది. వేశ్యపిచ్చిలో పడిపోయి కన్నబిడ్డని కడసారి సమయంలో కళ్ళతో చూసి ఓపిన ఉప చారం చెయ్యలేక పోయాను. ఓసీ! వ్యేశ్యాపిశాచీ! నాకండ్లకు కపటప్రేమ అనే కలికం వేసి నాసర్వస్వమునూ పీల్చేశావు! నాకన్న బిడ్డను కడుపున పెట్టుకున్నావు! మా కొంప నిలువునా కూల్చేశావు! నావంశరత్నాకరమును వల్లకాటిపాలు చేశావు! యెన్ని కొంపలుకూల్చినా, యెన్నిమాయలు పన్నినా, యెంత మంది భాగ్యశాలుల్ని పకీరుల్నిగా చేసినా, పైకి ఒకనిని నమ్మినట్లు నటనచేస్తూ ప్రక్కప్రక్కల వుంచుకున్నాతని కంట పడకుండా మాయలుపన్ని యెంతధనమార్జించినా, యేంబ్రతు కది? చివరికి యింతకింతకే ఫలితం అనుభవించి తీర్తావు. యమ లోకం అంతా యిక్కడే చూస్తావు, తప్పదు. యెంద రెందరినో మోసపుచ్చిన ఫలితం పూరికేపోదు. శరీరంలో జీర్ణించిన వ్యాధుల లాగా చేతిమీదుగా చేసిన పాపాలు నీపాపిష్టి హృద యపంజరములో గూడుకట్టుకుని నీ యవ్వన మదమాత్సర్య ములు కుంగిపోగానే పటాపంచలయి బాధిస్తాయి. మాయల మారీ! బంగారపు లాంటి కొడుకుని పొట్టపెట్టుకున్నావు. ఒసీ

రాక్షసీ! నిన్ను తలచిన మహాపాతకము. ...... యింతకీ పద్మ యెక్కడికి వెళ్ళివుంటుంది. యిల్లు వదిలిపెట్టి యే యిరుగు పొరుగుకి కూడా యెన్నడూ పోయేది కాదే! యీ రాత్రిసమయాన యెక్కడికి పోయింది? పద్మా!......పద్మా!... నేను వేశ్యా వ్యామోహంలో పడి నిన్ను పెట్టేబాధలు పడలేక మణిని కాపాడుకుంటూ యెంతో ఓర్పుతో వాడి ముఖం చూసుకుంటూ కాలంగడుపుతూ వుండేదానివి. వేశ్యలపైన విరక్తి కలిగి సంసారమును చక్కగా దిద్దుకుందామని నామనసు మంచి మార్గానపడి నిన్ను వెతుక్కుంటూ వచ్చేటంతలో మాయమై పోయావా పద్మా? యింతకాలం ఓర్పువహించిన దానివి యీమాత్రం ఓపిక పట్టలేకపోయావా? పద్మా వేశ్యలకు దాసాను దాసుడనై వేశ్యయెత్తించిన వెర్రిలోపడి యిల్లూ వళ్ళూ గుల్లచేసుకున్నాను. డబ్బు లెక్కచెయ్యకుండా డాబు సరికిపోయి ఆతోత్తుల మెప్పులు కోరుతూ గుప్పెళ్ళతో గుప్పేశాను. చేతులో డబ్బు సన్నగిలే రోజులలో నీకు తెలియకుండా నీ సొమ్ములుకూడా యెత్తుకుపోయి అమ్మి ధారపోశాను. నా మేలు కోరి నువ్వు యెన్ని చెప్పుతున్నా లెఖ్ఖపెట్టేవాణ్ణి కాదు. మణి విలువ తెలుసుకోనలేక మట్టిపాలుచేసినట్లుగా నీ మాటలు వినక నిన్ను కాలతన్ని నేలరాసిన దుర్మార్గుడను. పాపము, రాత్రింబవళ్ళూ నన్ను మంచి మార్గంలో పెట్టాల్నని యెంతో ప్రయాసపడ్డావు. రాత్రింబవళ్ళూ నాదుర్ప్రవర్తనకై తపించి పోయావు....పద్మా! ...... అయిదు వందల రూపాయిలూ నాకళ్ళకు గంతలు కట్టి ఆదుర్మార్గురాలు కాజేసినప్పుడు నిజం తెలుసుకోలేక నీవే ఆడబ్బు కాజేసితివనుకొని అనరాని మాట

లన్నాను. నే నెరగనని యెన్ని ప్రమాణాలు జేసినా ఆఖరికి మణిమీద ఒట్టుపెట్టుకున్నా వేశ్యపైనవున్న మోహముచేత నీమాటలు నమ్మక నిన్ను యెదురొమ్ములలో తన్ని, కుమ్మిపారేశాను. అప్పుడు నీ హృదయం యెంతగా బాధపడిందో గదా? యీ రాత్రి మటుకు యింట్లోవుండండీ, మణి మనకి దక్కుతాడో లేదో అని నాకు గుండె బ్రద్దలయిపోతోంది, యీ నా స్వల్పకోరిక చెల్లించండీ అని నీవు త్రోవకి అడ్డంతగిలి యెంతో దీనంగా ప్రార్థిస్తున్నా వినక నిన్ను యీడ్చి పారేసి వ్యామోహంలో పడిపోయాను. అప్పుడు నీహృదయం యెంతగా క్షోభపడిందో గదా. నీ జీవితానికి తామసపాము కాటయిన కర్కోటకుణ్ణి. వేశ్యాలోలుడనయి నిన్ను బాధలపాలుచేసిన పాపాత్ముణ్ణి. క్షమించు......పద్మా!......క్షమించవూ! ... ఒక్కసారి కనిపించవూ! నీవు ఒక్కసారి నా కంటపడితేచాలు నా హృదయానికి ములుకులై హృదయాన్ని తూట్లు తూట్లుగా చేస్తున్న ఆరాటములన్నీ మాయమయిపోతాయి. నా హృదయంలో ప్రజ్వరిల్లిన పశ్చాత్తాపమనే అగ్ని జ్వాలలు అంతరిస్తాయి! నీ ఓర్పూ నీ సహనము నీలోకలిగిన శాంతీ మెచ్చతగినవి.... పద్మా! మెచ్చతగినవి. నీహృదయము పవిత్ర హృదయము. నీబోటి పవిత్రహృదయమూ, ఆదర్శమయిన నడతా కలిగిన పతివ్రతాలతామలు నేటికి నీ భారతభూమిపైన అక్కడక్కడ వుండుటచేతనే మన భారతభూమి సకలభోగ భాగ్యములతో తులతూగుచున్నది — అని పద్మలో కలిగిన పవిత్ర గుణములను తలుచుకుంటూ రాత్రి అంతా పద్మా! పద్మా! అని కలవరించాడు. నీ వొక్కసారి కనపడితేచాలు నా ఆత్మ

శాంతిస్తుందన్నాడు! అల్లాడిపోయాడు! యేమంటే యేం ప్రయోజనం! ఏదీ పద్మ? తెలతెలవారింది. చీకటి వెలవెల బోతోంది. కాకులు కావు, కావుమంటున్నాయి, మంచు బిందువులు రాల్తున్నాయి, బాలభాస్కరుని అరుణ కిరణ సము దాయములు చతుస్సముద్రమేఖల అఖండ భూమండలంబునకు బంగారు పూతపూసి నట్లుండెను. యవ్వన భాగ్యము కలిగిన నవయవ్వనులూ, నూతన దంపతులూ, ప్రేమబంధములో చిక్కువడియున్నారు. అవి కళ కళలాడు సంక్రాంతి పండగ రోజులగుటచేత ప్రతివారునూ వారి వారి గుమ్మములముందు ముచ్చటగా ముత్యాల ముగ్గులు వేయుచున్నారు. ఏ గుమ్మం ముందు చూసినా పువ్వులు పువ్వులులాగా, తీగెలు తీగెలులాగా, గుత్తులు గుత్తులులాగా, పెద్ద పెద్దరథాల్లాగా, వింతవింత ముగ్గులు కళ్ళపండుగై కనిపిస్తున్నాయి, ...... యీ వార్త వూరి మీద అప్పుడే యెక్కడపడిందోగాని గోదావరి ఒడ్డున తండోపతండాలుగా జనంచేరారు.. వూళ్ళో జనం గోదావరికి గుంపులు గుంపులుగా వెళుతున్నారు,.. పద్మశవం గోదావరి ఒడ్డున పడివుంది. తిరణాల్లాగా జనం వస్తున్నారు చూస్తున్నారు ఆశ్చర్యపోతున్నారు. పద్మశవంచూసి వెళుతున్నవారిలో అన సూయ మహాలక్ష్మి యిలా అనుకోవటం మొదలెట్టారు.

'యిలా నిండు ప్రాణం తీసుకోవటానికి ఆతల్లికి యేం కష్టాలు కలిగాయో?' అంది రమణమ్మ.

'యెంత కష్టంకలగకపోతే యింత పనిచేస్తుంది రమణ మ్మత్తా?' అంది అనసూయ.

'యెంతకష్టం కలిగితే మటుకు ప్రాణంతీసుకోవటం యెందుకే చేతకాకపోతేసరి. అయ్యో! యెఱ్ఱగావుంది చాయకి చక్కటి కను ముక్కుతీరూ! మనిషి మంచి పసందుగావుంది...'

'నేను ఆచచ్చిపోయిన ఆమెను యెరుగున్నాను అత్తా! భర్తతో మహాబాధలు పడేది...'

'యేం ఆ చచ్చినోడు మంచివాడుకాడా అనసూయా?'

'చేసుకున్న భర్త మంచివాడయితే ఆడదానికి అవస్థలు యెందుకు వస్తాయి అత్తా? ఆ పోయిన ఆమె పేరు పద్మావతి!'

'సహజంగా ముఖం పద్మంలాగానే వుంది అనసూయా! ప్రాణాలుపోయినా ముఖంలోవున్న కళ మటుకు పోలేదసుమా!'

'యీమె భర్త మంచివాడు కాదు...'

'అంతే... పెళ్ళి పాడుచేస్తారా?'

'ఒక బోగంమనిషిని వుంచుకొని వున్నదంతా దానికి పెట్టాడు...'

'ఏముండలు ముక్కలుకానూ, ప్రతివాళ్ళకూ యిదొక పెద్దరోగమయిపోతోంది. సరిగా కళ్ళుతెరవని వాడికీ ముండే! వయసులోవున్న వాడికీముండే! వయసు మళ్ళిన వాడికీ ముండే! ముసలముండాకొడుక్కీ ముండే! సంపాదన పరునికీ ముండే! పూటకి టికానాలేని వాడికీ ముండే!...'

'చివరికి పెళ్ళాం మెళ్ళోనగలు కూడా కొన్ని అమ్మి పాడుచేశాడు...'

'సంపాయించి పెట్టేచచ్చేది లేదుకదా! వున్నవికూడా అమ్మిపాడుచెయ్యటం యేం రోగం!'

'రాత్రింబవళ్ళూ ఆభోగంముండ యింట్లోనే వుండేవాడు యింటికి వచ్చే వాడేకాదు.'

'యింకెందుకు వస్తాడూ?'

'ఒకవేళ వచ్చినా యే అర్ధరాత్రి సమయానికో వస్తూ వుండేవాడు ఒళ్ళూపై తెలియకుండా త్రాగితూలుతూ...'

'త్రాగుడుకూడానా?'

'అహాపూర్తిగా...'

'ఓరి వీడిదుంపతెగా!'

'త్రాగినదానిమీదట వళ్ళు తెలియక పెళ్ళాన్ని తెగ చావకొట్టేవాడు. ఒక్కొక్కరోజు చచ్చేటంత దెబ్బలు కొట్టే వాడట...'

'త్రాగినవాడికి క్రిందా మీదా కనపడుతుందిటే అసలు'

'భర్త అంత అవస్థలు పెడుతున్నా ఒక్కళ్ళతో నోరెత్తి చెప్పుకోనైనా చెప్పుకోదు...'

'అవును కొందరు మూనుషానికి పడి చస్తారు.'

'నేను యెన్నోసార్లు వాళ్ళ యింటికి వెళుతూవుండేదాన్ని. నేనంటే యెంతో ప్రాణంగా వుండేది. భర్తవిషయం యేదయినా వస్తే నాకు మంచిరోజువస్తే ఆయన మనసు అప్పుడే మారు తుంది. ఆయన స్వేచ్ఛకు అడ్డుపోవటం యెందుకు అనసూయా! నాఖర్మం యెలా జరగాల్సి వుంటే అలా జరుగుతుంది. గీతలో లేంది గీసుకుంటే మటుకు వస్తుందా అంటూవుండేది పాపం.'

'అంత కష్టపెడుతున్నా భర్తంటు మక్కువే కాయి ల్లాలికి!'

'అవును అత్తా! ఒక్కనాడు నోరెత్తి భర్తను పల్లెత్తు మాట అనగా నేను వినలేదు. వీళ్ళకి బంగారపు బొమ్మలాంటి పిల్లాడు వున్నాడు...' అంటూ యేమేమో చెప్పుకుంటూ పోతున్నారు. ఆ తోవనే వస్తున్నాడు మాధవరావు. మణి చనిపోయినందునా, పద్మ కనిపించనందునా, మాధవ రావు మనస్సు చెడిపోయింది. పిచ్చిఆకారం పడింది. అతని కళ్ళముందు పద్మ ఆకారమే తాండవిస్తోంది.- పశ్చాత్తాపమనే అగ్ని జ్వాలలు అతని హృదయాన్ని దహించేస్తున్నాయి.- పద్మ సుగుణాలూ, పద్మ శోధనలూ, అతని మనోనేత్రం ముందు మెరిసిపోతున్నాయి.- వేశ్యలుఇళ్ళ జరిగిన పరాభవం. మణిచావూ అతని హృదయానికి రంపపు కోతయింది.- త్రోవ వెంట వస్తూ పోతూవున్న జనాన్ని చూస్తూ, వాళ్ళు చెప్పుకునే మాటలు వింటూ వెఱ్ఱిచూపులుచూస్తూ, గోదావరి ఒడ్డు నకు సమీపించాడు మాధవరావు. జనసమూహంలోనుంచి, తొంగి చూశాడు. రాత్రి అంతెయూ గోదావరిలో నాని నాని వుబ్బి ముక్కులలోనుండీ, చెవులలోనుండీ, నీళ్ళుకారుతూన్న పద్మ శవం కంటపడింది. మాధవరావు గుండె బ్రద్దలైపో యింది. పద్మా!...పద్మా!...పద్మా! అంటూ దిక్కులు ప్రతి ధ్వనించేటట్లు కేకవేస్తూ, మొదలు నరికిన చెట్టులాగా పద్మ శవంమీద విరుచుకు పడ్డాడు. పద్మశవంమీదనే ప్రాణాలు ఒదిలిపెట్టాడు మాధవరావు.- చూస్తున్న వారందరూ దైవ ఘటనకు ఆశ్చర్యపోయారు.-